# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక.

సం|| పుటలు-44 మన్మథనామ సంవత్సరము, జ్యేష్ఠ-ఆషాఢ మాసములు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు.

సంపుటము ౪౪ } మన్మథ సంవత్సరము జ్యేష్ఠాషాఢ మాసములు } సంచి

## స్వాగతము

శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి, అరుణాశ్రమము, నడకుద

శా. శ్రీమన్మూర్తి, పవిత్రవర్తన, ప్రజా
క్షేమాంకితాత్మా, జగ
త్ప్రామాణ్యప్రథితార్షధర్మ పునరు
త్థానైకసత్కార్య ని
ష్ఠామారంభవిజృంభమాణనిజసా
చివ్యాధికార స్ఫుటా
సామాన్యాశయ, చంద్రమౌళీ, సుగుణ
శ్రద్ధాళు వర్ధిల్లుమా.

శా. ఈ సాహిత్యసభాగృహాంగణమునం
దీనాఁడు నీవింత శ్రీ
ద్ధాసౌభాగ్యము మీఱ కాలిడిన చం
దంబెల్ల నీ దేశ భా
షాసంరక్షణబద్ధ దీక్ష కొక సా
త్త్వం బౌను నిర్దుష్ట భా
షాసేవాంకితులైనవారి కొక యు
త్సాహం బగుఁ ధీనిధీ!

శా. ఏనాఁడో మన పీఠికాపురవరా
ధీశాన కారుణ్య భా
వానంతర్యముగా మహామహుల సా
హాయ్యమ్మునన్ జ్ఞాన వి
జ్ఞానానందమయాంధ్రసాహితి యథా
శక్తిన్ బ్రపూజింప సు
స్థానంబై పరిషత్తు పుట్టినది వి
ద్వల్లోక మగ్గింపఁగన్.

ఉ. నాఁటికి నాఁడు ఘోర పత
నమ్మున దిక్కఱి పోవుచున్న యీ
తేట తెలుంగు బాస కొక
తీరును సౌరును నిల్పి శుద్ధమా
బాటను నిల్పి సుక్రమ ని
బద్ధము చేయఁగ వేయిరీతులన్
నేఁటికిఁగూడఁ బూనుకొని
నిల్చిన దీ పరిషత్తు దీక్షతో.

ఉ. ఊరక రాజకీయముల
నుక్కిరిబిక్కిరి యౌచు వ్యగ్ర తా
వారలె కాని భాషకు శు
భస్థితి గూఱిచి ధర్మరక్షణో
దారపథమ్మున నడచు
తాదృశు లిప్పుడు దుర్లభుల్-భవ
చ్చారుతర ప్రయత్నములు
సర్వజగచ్ఛుభ వృద్ధి హేతువుల్.

ఉ. సర్వజగత్ప్రపత్తి నగు
సంస్కృతభాష సముద్ధరింపఁగాఁ
బర్విన నీదు భావవిభ
వంబు ఫలించినఁ బ్రాచ్యభారతా

ఖర్వమహాత్త్వ మెల్లఁ బొడ
 కట్టఁ దపంతిటఁ దా నిసర్గమై
యుర్వి సహింప సత్యము మ
 హోన్నత రీతులఁ బాలితం బగున్.

మ. ధర పాశ్చాత్యములం బొసద్పునెడ మ
 త్ప్రసన్నంబగుచ్ ముందుగా
మరదృష్టమ్మునఁ బ్రాతికూల్యగణ మెం
 దుం గాని యుష్మాదృశుల్
స్థిరచిత్తుల్ పెనుకంజ పైచి భువన
 శ్రేయఃపదం బైన త
ద్గురు కార్యమ్మును బాయనొల్ల రెద నాం
 దోళింప రొక్కింతయున్.

ఉ. మాపరిషత్తు శాస్త్రనియ
 మ ప్రతిపాదిత సంస్కృతాంధ్ర భా
షాపరభాగ గౌరవముఁ
 జాటఁగఁ బుట్టి యనన్యముగ్ నిరా
టోపము నైన పద్ధతిఁ గ
 దుంగడు గణ్యతఁ గాంచె దీనికిన్
బ్రాపు నొసంగి ప్రోవఁగల
 భారము నీయది మంత్రిసత్తమా !

మ. ఒకరంగస్థలమంచు నేర్పడిరొ నీయూరన్ సదా దాన నె
ద్దిక పైఁ భారతి శుద్ధరూపమున నర్తింపన్ దదీయమ్ము లౌ
వికసన్నానృపురకంకణధ్వనులు దిగ్వీథిన్ విజృంభింపఁ దా
వక సాహాయ్యము ప్రోల్పుఁగావుత - జగద్భద్రమ్ము చేకూ

# వినతి

ర్యా !

ఆంధ్రజాతిజీవనమునకు, ఏకీకరణమునకు, ముఖ్యాంగ మగు
ంధ్రభాష, వాఙ్మయము, చరిత్ర, మున్నగు విషయముల పరిశోధనలు
ల్పి, భాషాపోషణకుఁ గృషిసల్పుటకై, ఈ 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు
911 లో మద్రాసు పట్టణమున, శ్రీ జయంతి రామయ్య పంతులుగారి
ోద్బలమున,స్థాపింపఁబడినది. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు
గారు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు, శ్రీ వావిలకొలను సుబ్బా
రావుగారు, శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారు, శ్రీ గోటేటి కనక
రాజుగారు, శ్రీ మొక్కపాటి సుబ్బారాయఁడుగారు, శ్రీ కొమర్రాజు
క్ష్మణరావుగారు మున్నగు విద్వాంసుల కృషికి, శ్రీ పీఠికాపుర సంస్థా
ాధీశ్వరులౌ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావుగారి యం
యు, శ్రీ వెంకటగిరి మహారాజా, బొబ్బిలి మహారాజా శ్రీ విక్రమవర్మ
గారల చేయూఁతయు లభించినది. దేశమందలి పెక్కు సంస్థానాధీశ్వరు
ును, అభిమానులును పరిషన్నిర్వహణమునఁ బూనిక వహించిరి.

ఆంధ్రమున సమగ్రమగు నిఘంటునిర్మాణము, తాళపత్ర గ్రం
ముల సేకరించి, అముద్రిత గ్రంథముల ముద్రింపించి ప్రచురించుట,
ారిభాషిక పదావళిని సేకరించి నిర్ణయించుట, ఆంధ్ర చరిత్ర, భాష
కు సంబంధించిన శాసనములు సవిమర్శముగఁ బ్రకటించుట, పాఠభేద
సహితముగ సపురూపములగు గ్రంథముల, పూనా భండార్కర్ ఇనిస్టి
ట్యూట్ వారు సంస్కృత మహాభారతమునువలె, ప్రకటించుట; ఆంధ్ర
ాషకు సమగ్రమగు వ్యాకరణము సమకూర్చుట; లిపి, భాష, వాఙ్మ
యము చరిత్రలకుసంబంధించిన విషయములఁ గూర్చి పరిశోధనలు సల్పి,
జల కందించుట; వాఙ్మయచరిత్ర, దేశచరిత్ర ప్రకటించుట; ఈ పరిషత్తు
ుఖ్యోద్దేశ్యములు.

భాషాభిమానులు, జమీందారులు చేసిన ధనసాహాయ్యమువల
పండితులను దేశము నల్దిక్కులకుఁ బంపి, మాఱుమూలలఁ బడియుం
రమారమి ఆఱు వేల తాళపత్రి గ్రంథములు సేకరింపఁబడి పరిషద్గ్రంథా
యమున భద్రపఱుపఁబడినవి. ఇప్పటికి డెబ్బది యపురూపములైన గ్రం
ములు ముద్రించి ప్రకటించియున్నాము. అందు శివరాత్రి మాహాత్మ్య
వంటి కొన్ని గ్రంథములకుఁ బ్రత్యంతరములుకూడ నెక్కడను లే
చరిత్ర భాషా, వాఙ్మయ విషయముల పరిశోధకులకు పకరించు Indi
Antiquary, Epigraphica Indica మున్నగు నమూల్యములు న
రూపములు నగు ముద్రిత గ్రంథములు (ఆంధ్రము, ఆంగ్లము, సంస
తము) ఆఱువేలకుఁ పైఁగా పరిషద్భాండాగారమున సేకరింపఁబడినవి

ముద్రింపించి ప్రకటింపవలసిన గ్రంథము లింకను నెన్నియో
కలవు. తాళపత్త్రముల నుండి, కాగితములపై వ్రాయించి భద్రపఱ
కున్న, తాళపత్రము లగుటచే, ఎన్నివిధముల జాగ్రత్తపఱచినను, కా
వశమున శిథిలమై, స్వరూపములుకూడ నాశన మగు నను భీతి కలుగు
న్నది. విద్వాంసుల నియోగించి, తాళప్రతులనుండి వ్రాఁతప్రతుల
నిర్దుష్టముగ వ్రాయింపవలెను. ఒకే గ్రంథమునకుఁ బెక్కు తాళప్ర
లలో నెన్నియో పాఠాంతరములు గలవు. వ్రాఁతకాండ్ర లోపమువల
గలిగిన యపభ్రంశములు గాక, కొన్ని గ్రంథములలో నేపాఠమున కా
ఠము సమంజసముగను, శుద్ధముగను గన్పట్టు చున్నవి. ఏపాఠము
థకర్తదో, నిర్ధారింపశక్యము కాదు. అట్టితఱి నిర్దుష్టము లగు పాఠ
లన్నిటితో ముఖ్యగ్రంథములనైనఁ బ్రకటించినఁ జరిత్రకారులకుఁ
శోధకులకు మిక్కిలి యుపయుక్త మగును.

పరిషద్వ్యవస్థాపాధ్యక్షులగు శ్రీ పీఠికాపురాధీశ్వరులయుదారస
య్యమువలన నార్యరాయాంధ్రనిఘంటురచన, సేకరణ, యురువ

ద్దకుఁ బైనుండియుఁ బెక్కండ్రు పండితులచే సాధింపఁబడి, యిప్పటికి వేయి పుటలకొప్పున 'అ' మొదలు 'ద్ర' వఱకు నాలుగు సంపుటములు ముద్రింపఁబడి ప్రకటింపఁబడినవి. తక్కంగల భాగరచనయుఁ బూర్తి యయి ముద్రణమునకై శ్రీ పీఠికాపురాధీశ్వరులు మద్రాసులో నుంచినారు. ఆ కార్యము పూర్తి చేయవలసి యున్నది.

అముద్రిత గ్రంథములు, శాసనములు, చరిత్ర, లిపి, భాష, వాఙ్మయము సాహిత్యములకు సంబంధించిన పరిశోధన వ్యాసములయు, విమర్శనములయు, ప్రకటనకై ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక యను ద్వైమాసిక పత్రికను నీ పరిషత్తు ప్రకటించుచున్నది. యుద్ధమల్లుని బెజవాడ శాసనము, నందంపూడి శాసనము వంటి ప్రాచీన శాసనములు 47 సవిమర్శనముగ నీపత్రికా ముఖమునఁ బ్రకటింపఁబడెను. పరిషత్తు వార్షిక సభలను నిర్వహించుచు, పండితులను, విద్వాంసులను, విమర్శకులను, పరిశోధకులను జేర్చి విద్యా వ్యాసంగములు నుపన్యాసములు, చర్చలు నేర్పఱచి, ప్రజాబాహుళ్యమునకు నభిరుచిని, విజ్ఞానమును గల్గించుటకు దోహద మొనర్చుచున్నది.

పరిషత్తునందు సభ్యు లిచ్చెడి చందా సంవత్సరమునకు ఆఱు రూపాయలుమాత్రమే. లక్ష్మి, సరస్వతుల సాహచర్యము దుస్తర మగుటచే, దేశమందలి సుప్రసిద్ధ విద్వాంసులు, నియమావళినిబట్టి గౌరవ సభ్యులు. చందా లిచ్చెడి సభ్యుల సంఖ్య పరిమితము.

వేంకటగిరి, బొబ్బిలి సంస్థానాధీశ్వరు లిచ్చిన రూ. 20,000/- గవర్నమెంటు పత్రముల రూపములో నున్న మూలధనమువలన సంవత్సరమునకు,ఆఱువందల రూపాయముమాత్రము వచ్చుచున్నది. గ్రంథముల విక్రయమువలన వచ్చు నాదాయము స్వల్పము.

పత్రిక ప్రకటనమునకు వలయు కాగితములు కొనుట, అచ్చు, గ్రంథముల వ్రాతప్రతులు సిద్ధపఱచుటకుఁ బండితుల వేతనములు, పరిష

కార్యాలయోద్యోగుల జీతములు, మున్నగు వ్యయముల భరించుట
రాఁబడి చాలక, ఉదారాశయుల సాహాయ్యములపై నాధారపడి యున్న

వార్షిక సభలకుఁ బండితుల నాహ్వానించి, సభల నిర్వహించ
కగు వ్యయము లిదివఱలో విద్యాపోషకులగు జమీందారుల సా
మున ముఖ్యముగ లభించుచుండెడిది. జమీందారీల రద్దుతో, ఆ స
య్యము మృగ్య మైనది.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము బోర్డువారు, Tirup
Oriental రిసెర్చి ఇన్‌స్టిట్యూట్యులో, ప్రముఖ విద్వాంసుల నియమిం
వాఙ్మయపరిశోధనకు దోహద మిచ్చుటయే గాక, అముద్రిత సంస
కాంధ్ర గ్రంథముల నచ్చొత్తించుచు విద్యాపోషణకు మార్గదర్శకులై

విశేషాదాయములు గల అన్నవరము, సింహాచలము వంటి
దేవాలయములు, ఇతర ధర్మాదాయములు, మనరాష్ట్రమునఁ బె
కలవు. విద్యాపోషణకు విజ్ఞానాభివృద్ధికిని, అట్టి సంస్థల యాదాయ
నుండి కొంత సొమ్ము వినియోగించుటకుఁ జట్టమున నవకాశము కల
కీర్తిశేషులు శ్రీమతి ప్రభల చిలుకుడు అను వేంకట సుబ్బమ్మ
భూరివిరాళముతోఁ బరిషత్తున కీసుందరరామభవనము నిర్మింపఁగల్గి
ఆమె మరణశాసనమునఁ బరిషత్తుకు మరల నీయనేర్పఱిచిన ఆ
రూప్యములతో భవనముకుఁ గల లోపములు పూర్తి గావింపఁగల
పరిషత్కార్య నిర్వహణాదికముల కిదివఱలోవలెనే, యెట్టిట్లో
ఘ్నముగ జరుపుచుందుము. అట్టి ధర్మాదాయమునుండి లభించు
కములను బ్రత్యేకముగాఁ దాళపత్రి గ్రంథములనుండి వ్రాఁతప్రతి
వ్రాయించి యముద్రిత గ్రంథముల ముద్రణమునకు మాత్రమే విని
గించెద మనియు, మఱి యే యితరములకు వెచ్చింప మనియు మన

విద్యా విషయికమై నలువది నాల్గేండ్లకుఁ బైఁగాఁ బాటుపడుచ
యీ సంస్థకు, అన్నవరము, సింహాచలము, ద్రాక్షారామ, ద్వారకా

# యక్షగానము — హరికథ

శ్రీ బాగేపల్లి అనంత రామాచార్యులవారి కృతులు.

శ్రీ యస్వీ. జోగారావు, ఎమ్. ఏ.

యక్షగాన మన్నను హరికథ యన్నను నొక్కటే య
దఱు పండితు లభిప్రాయపడుట గలదు. నా యెఱుక కందిన
శ్రీ బాగేపల్లి అనంతరామాచార్యు లను నాయన యీ య
మును మొదట వ్యక్త మొనర్చినవారుగాఁ గనఁబడుచున్నారు.
రాయలసీమ అనంతపురమండలము హిందూపురము వా స్త
19 వ శతాబ్ది యుత్తరార్థమున నుండినవారఁట. ఆయన నగ
నూర నొక గుమస్తా యుద్యోగమునం దుండినను నాప్రాంత
హరికథోపన్యాసకులుగాఁ బ్రసిద్ధి వడసి రఁట. హరికథోపన్యాస
గాఁ గాకభక్తిశో నవలంబించినవారఁట. వారు హరికథల నుపన్య
కాక స్వయముగాఁ బలురచనలు గావించిరి. అవి యముద్రితము
శ్యము ముద్రణీయములు. అం దేడింటి వ్రాఁతప్రతులు శ్రీమా
పల్లి అనంతకృష్ణశర్మగారి కడ నున్నవి. వారే నాకీవిషయ మె
గించిరి. దయతో గ్రంథము లెల్లఁ జదువ నొసంగిరి. వారికి నేను
చెప్పుకొని మఱి యారంభింపవలె నీ వ్యాసము. ఆ గ్రంథము
హరికథలే. (ఆ యీ గ్రంథసమీక్ష తరువాతఁ జేయఁబడును
నాల్గు యక్షగానము లనియుఁ గవిచేతనే వ్యవహరింపఁబడిన
వ్యవహృతములైన వానిలో శశిరేఖాపరిణయ మనుదాని
కాలము వ్యయసంవత్సరముగాఁ జేర్కొనఁబడెను. అది క్రీ.
అనఁగా నప్పటికే అనంతరామాచార్యుల వారికి హరికథ
యక్షగాన మను నభిప్రాయ మున్నదన్నమాట. తరువాత ప
న్యాసక చక్రవర్తులు, సంగీతసాహిత్యకళాపారంగతులు నైన
ఆదిభట్ల నారాయణదాసుగారు క్రీ. శ. 1899 లో మిసర్వా

క్షర శాలలో ముద్రితమైన తమ ప్రహ్లాదచరిత్ర మను హరికథ యవతారి
కలో హరికథ యన్నను యక్షగాన మన్నను నొకటే యను నభిప్రా
యముతో నొక పద్యము రచించిరి. అది:—

సీ॥ ఘనశంఖమో యనఁ గంఠంబు పూరించి
మేలుగా శ్రుతిలోన మేళవించి
నియమము తప్పక నయఘనంబులఁ జెప్పి
రాగభేదంబుల రక్తినల్పి
బంతు లెగిర్చిన పగిదిఁ గాలజ్ఞతఁ
జాతిమూర్ఛన లొప్ప స్వరముఁ బాడి
చక్కని నృత్యముల్ సద్వరసాను కూ
లంబుగ నభినయనంబుఁ జేసి
తే॥ స్వకృత మృదు యక్షగాన ప్రబంధసరణి
వివిధ దేశంబులం బిన్న పెద్దలు గల
బలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమాన మేల''

ఈ పద్యమే యాంధ్రపత్రిక విరోధికృత్సంవత్సరాది సంచికలోఁ
వాడ (పుట. 77) హరికథ యను శీర్షిక క్రింద నుదాహరింపఁబడినది.
దాసుగారు వారి 'అంబరీష చరిత్రము' (ద్వితీయముద్రణ-సరస్వతీబుక్
షాపు ప్రచురణ, బెజవాడ, 1929) ఉపోద్ఘాతములో 'ఈయంబరీషో
పాఖ్యానము దొట్టి మరికొన్ని యక్షగానములను వ్రాసియుంటిని...
కేఁ దెలిసిన పట్టు యక్షగానముల కుదాహరణముగ నిందుతోఁ బది
రచించినాఁడను' అని తన రచించిన హరికథల నన్నిటిని యక్ష
గానము లనియే వ్యవహరించిరి. పార్వతీపరిణయ మను హరికథ
(ప్రథమ ముద్రణ 1922 లో వివరము తెలియదు) రచించిన శ్రీ పసు
పర్తి కృష్ణమూర్తిగారు తదాశ్వాసాంత గద్యలలోఁ దమకృతి యక్ష

గాన ప్రబంధ మనియే పేర్కొనిరి. ఆయన దాసుగారి శిష్యులే.
కృతి గురువుగారికే యంకిత మిచ్చినవా రాయెను. శ్రీభక్తవిజయ
నింకొక హరికథ (రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ ముద్రణ,
కూడ యక్షగాన ప్రబంధముగనే పేర్కొనఁబడినది. తద్గ్రం
'శ్రీమత్సంపూర్ణ రామాయణ మహాభారత భాగవత శివపురాణా
యక్షగాన ప్రబంధకర్తలును హరికథోపన్యాసకులు నగు శ్రీ అయ
వీరభద్రరావుగారు.'

ఇట్లు పలువురు పండితులు సామాన్యులుకాదు, స్వయ
హరికథా గ్రంథరచన గావించినవారే యభిప్రాయపడి రనఁగా నది
లేము. వానిలో నేదో సాదృశ్యము లే దనలేము. కాని రె
బూర్తిగా వాని యుత్పత్తి పరిణామములనుబట్టి యభిన్నము లన
జక్కులకథలు (యక్షగానములు) జంగం కథలు, హరికథలు,
కథలు-ఇవియన్నియు గేయరూపమునఁ గథాఖ్యానమే ప్రధాన
ముగాఁ బ్రారంభింపఁబడినవి. కావునఁ దత్త్రచనా ప్రక్రియలలోఁ
సాదృశ్యము గోచరించినను వాని వాని ప్రయోగ ఫక్కికలు
ప్రయోజనములు వేఱు, వాని పుట్టువు పొలకువలే వేఱు వేఱు.

ప్రకృతవిషయము యక్షగానము హరికథల యుత్పత్తి పరి
ముల గూర్చిన విచారణ. యక్షగాన మాంధ్రదేశమున పదు
శతాబ్ది నాఁటికే ప్రచారము నందుండినట్లు తెలియవచ్చును.
తొలినాళ్ళలో జక్కులవారిచేఁ బ్రవర్తింపఁబడుచుండుటచే దానిక
వచ్చి యుండవచ్చును. అది హరికథవలె నాఖ్యానింపఁబడుచు,ఇఁ
నాడువారిచేఁ బారాయణము గావింపఁబడుచు,బొమ్మలాటవారిచే
పాటగాఁ బరిగణింపఁబడుచు,వీథిభాగవతులచే రూపకముగాఁ బ్రద
బడుచు నిట్లు బహుముఖ ప్రయోజనములతో బహుముఖ
వర్ధిల్లుచు వచ్చినది. స్వరాష్ట్రములందుఁ గొంతకుఁగొంత తత్సజ

రైన ప్రక్రియలు, ఉదాహరణకు వంగదేశపు యాత్రానాటకములు
మొదలగునవి యున్నను, ఆ యక్షగానము పేరితో నట్టివి లేవు. కన్నడ
తమిళ రాష్ట్రములం దున్న వన్న నవి యాంధ్రదేశ యక్షగాన రచనల
ప్రాచీనము లైనవి. హరికథోదంతముం జూచినచో నది బౌద్ధైతిహాసిక
యుగములకే కాదు; వేదకాలమునకే బీజరూపమున నున్నట్లు శ్రీ ఎమ్.
ఎస్. రామస్వామి యయ్యరు తమ కాలక్షేప మను నాంగ్లగ్రంథమున
వ్రాసియున్నారు. కాని యేదో కథ చెప్పుట, అది విష్ణుకథ యగుట
యనునట్లుగాక మనమీనాఁ డనుకొనుచున్న విశిష్టలక్షణములు గలదిగా
హరికథ రూపొంది ప్రచారము గాంచుట మధ్యయుగమున మహారాష్ట్ర
మునఁ బదునేడవ శతాబ్ది పూర్వార్ధమున నుండిన ప్రసిద్ధ మహారాష్ట్ర
భాగవతుఁ డగు తుకారామ్ హరికథాకాలక్షేపములు చేయుచుండినట్లు
తెలియుచున్నది. ("తుకారామ్ మాచీగాథా" అను గ్రంథము
నిర్ణయసాగరముద్రణ. బొంబాయి 1937. అందు అభంగములు
4045 వది మొదలు 4049 వఱకు). దక్షిణ దేశమునకు హరి
కథా కాలక్షేపము దిగివచ్చుట పదునేడవ శతాబ్దములో, అటు
కర్ణాటకము, ఇటు తంజాపూరి యాంధ్రనాయక రాజ్యము మహా
రాష్ట్రుల కైవసమైన తరువాతనే. తంజాపూరి నేలిన మహారాష్ట్ర
ప్రభువు లంతకముం దాంధ్రనాయక రాజులు మిగుల నాదరించిన
యక్షగానప్రక్రియ తమ హరికథాసంవాదిగా నుండుటచేతను, అంతకన్న
మరియొక మెట్టెక్కువగా రూపకప్రయోజనము గల్గియుండుటచేతను
గానమును దానిని నాయకరాజులకంటెను నెక్కుడుగ నాదరించిరి.
స్వయముగా నెన్నో యక్షగాననాటకములను రచించిరి. కాని యాంధ్ర
మున వారై తమ హరికథలను వెలయింపలేదు. కాని మహారాష్ట్రులకుఁ
పుట్టినింటను బొరుగు వారైన మధుర సౌరాష్ట్ర సభవారు పిదప
కాలమున తెనుఁగునఁ గొన్ని హరికథలను వెలయింపఁజేసిరి. (కొన్నిటి

ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్న
నంబర్లు ఆర్. 1602×1608.) తత్రాపి మనవారును రూపకావకాశ
లేనియెడ నేకపాత్రాభినయమునకైనఁ బనికివచ్చు ననియో, అన్య
ప్రబంధచ్ఛందస్సుల కాకృష్టు లగుటచేతనో నాఁటినుండి హరికథా గ్ర
రచనకు దొరకొనిరి. అసలు యక్షగానము లీ నాఁటికిని రూపకము
బ్రదర్శింపఁబడుటకాక హరికథగాఁ జెప్పఁబడు సంప్రదాయముగ
కర్ణాటకమున మైసూరు ప్రాంతమునఁ గలదని వింటిని. అనంతరా
చార్యులుగా రది యెఱిఁగి యుండవచ్చును. అది యక్షగాన ప్రారంభ
వంటి దైనను నిజమున కా సంప్రదాయ మీ హరికథల ప్రభావ
సూచించు ననవచ్చును. ఏదెట్లయినను మనకు యక్షగానరచన ప్ర
నము. హరికథారచన యాధునికము. నేఁటి హరిదాసులు హరికథ
యక్షగాన ప్రబంధము లని పేర్కొనినట్లు, ప్రాచీన యక్షగాన
లెవ్వరును యక్షగానమును నది వైష్ణవేతివృత్త మగుచో నాపచా
ముగా హరికథయనుట తప్ప (ఆ యనుటయుఁగదాచిత్కముగా) ప్రక్రియ
హరికథ యని వ్యవహరింపలేదు. లాక్షణికులుగూడ వస్తుచ్ఛం
వైవిధ్యము విశేషముగఁ బ్రదర్శించియుండుటచే యక్షగానమున
నిష్కృష్ట లక్షణము నేర్పరింపలేకపోయిరి. ప్రక్రియగా నావదులుతన
మొదట తాళప్రధానము లైన దరువులతో, ద్విపదలతో, కొలఁది గ
పద్యములతోఁ బ్రాదుర్భవించిన యక్షగానమును వివిధదేశి పద క
రీతులను, కర్ణాటక సంగీతమునకుఁ బ్రాచుర్యము వచ్చిన దినము
నా యా రాగప్రభేదములను, దక్షిణదేశమున కొత్తరాహు
సంపర్కము కలిగిన రోజులలో నా హిందూస్తానీ రాగములు మ
నిముడ్చుకొనునట్లు చేసి, రానురాను ఛందోవైవిధ్య విశిష్టగేయ ప్ర
సామాన్యవాచియా యనిపించి నేఁటికి హరికథలకుఁగూడపర్యాయ
కముగా నిలిపినది. అసలు హరికథ ప్రయోగవిషయమున యక్ష

ప్రారంభదశను సూచించును. రచనాప్రక్రియలో నీనాటి ధోరణినిబట్టి రెండింటను నెట్టి ఛందస్సులనైన పాటలనైన నెట్టి కథనైన నెల్పుకొల్ప వచ్చును. ఈ నాఁడు యక్షగానము లెట్లు యక్షులచే (జక్కులచే) గానము చేయఁబడుటలేదో యట్లే హరికథ లన్నియు విష్ణుకథలు గావు. శివకథలు, చివరకు శివాజీ, గాంధీజీ కథలును హరికథలపేర 'చలామణి' యగుచున్నవి. అంటే యిక ప్రక్రియకేగాని యీ పేరునకుఁ బ్రాముఖ్యము పోయిన దన్నమాట. అసలు కడమ ఛందస్సులమాట యెట్లున్నను గథాఖ్యానమునకు యక్షగానములలో ద్విపద, (జంగంకథలలో రగడ), హరికథలలో డోరాలు, తోహరాలు సంప్రదాయసిద్ధముగా వాడఁబడుచున్నవి. నారాయణదాస ప్రభృతుల రచనలలో డోరా తోహరాలకు బదులు మంజరి యను రచనావిశేషము గన్పట్టును. అది మన మంజరీద్విపద కాదు. డోరావంటిదే. హరికథలలో మన ద్విపదలు, కందార్థాదులును జేరినవి. యక్షగానములలో (ఇటీవలివానిలో) డోరా తోహరాలును, మరి కొన్నిట లావణి మొదలగు మహారాష్ట్రచ్ఛందస్సులును జేరినవి. అందులకు యక్షగానములుగా వ్యవహరింపఁబడిన యనంతరామాచార్యులవారి కృతులే సాక్ష్యము.

ఇఁక సంగ్రహముగా వాని సమీక్ష:

అనంతరామాచార్యుల కృతులుగాఁ బదునొకండు తెలియవచ్చినవి. అవి

1. చంద్రహాసచరిత్రము. 2. మూడున్నరవజ్రము. 3. అనసూయచరిత్రము. 4. కుచేలోపాఖ్యానము. 5. సావిత్రీచరిత్రము. 6. సుభద్రాపరిణయము. 7. శశిరేఖాపరిణయము. 8. ప్రహ్లాద చరిత్రము. 9. రుక్మాంగదచరిత్రము 10. ఉషాపరిణయము 11. రామాశ్వమేధము

ఇవియన్నియు సముద్రితములు. ఇందు చివరి నాలుగుతప్ప తక్కిన యేడింట ననసూయా చరిత్రము, సావిత్రీచరిత్రము, సుభద్రాపరిణయము, శశిరేఖాపరిణయము మాత్రము యక్షగానములుగాఁ

బేర్కొనఁబడినవి. కాని వానిలో నట్లు పేర్కొనఁబడని వానిలోనుగూ
రచనా ప్రక్రియ యొక్క ఫక్కిగనే నడచినది. అన్నిట తోహరాల
సమపాళముగా వాడఁబడిన వివిధ ప్రసిద్ధకర్ణాట హిందూస్థానీ రాగమ
లలో (ఉదా॥ కల్యాణి, ఆనందభైరవి, శంకరాభరణ, ధన్యాసి, రేగుప్తి
సురటి, నాదనామక్రియ, కానడ, సావేరీ, కేదారగౌళి, భైర
మోహన, కాఫీ, బేగడ, ఫరజు, కమాచ్, బేహాగ్, దేశి, తో
అఠాణా, జంఝూటి, దర్బారు, గజల్, నోటు, లావణి మొ॥) తెలు
ఆది, ఆట, రూపక తాళములలో విరళముగా, ఏకత్రిపుటలలోఁ బాట
జాత్యుపజాతి వృత్తములు, కొన్నిట షట్పదులు మాత్రము, కొన్ని
ద్విపదలు, కొన్నిట నవియు నివియు, ఒండురెండింటఁ దక
తక్కిన యన్నిటను వచనములును విరివిగా వాడఁబడినవి. పాటలకన్ని
బల్లవియనుపల్లవి చరణ విభాగము గలదు. అన్నిగ్రంథములు వృషశై
స్వామి కంకితములు. ప్రతిగ్రంథము తత్స్తుతితోఁ బ్రారంభించును. త
వాతఁ బ్రాయికముగ లక్ష్మీస్తుతి, గురుస్తుతి పేరిట రామానుజస్తుతి
నుండును. గ్రంథనామముతోఁ గథారంభ మొక తోహరాలోఁ
పేరితోఁగూడ కథాంత మొక తోహరాలోఁ జెప్పఁబడును. మంగళ
ముతో గ్రంథాంతము. ఆశ్వాసాది విభాగమెందును లేదు. ప్రతికథ
సూతుఁడు శౌనకాదులకుఁ బరీక్షిత్తునకు బాదరాయణి, జైమిని జన
జయునకు—ఇట్లెవరో యొకరు మఱియొకరికిఁ జెప్పినట్లు గలదు. అన్ని
కథ ప్రసిద్ధమైనదే. ఒక్క మూఁడున్నర వజ్రమునందక్క యందుఁజరిగొ
ధర్మనగారి చిత్రభారతము నందువలె గయోపాఖ్యాన కథ మూ
లగాఁ గొని విచిత్రకల్పన కొంత చేయఁబడినది. అల్పదోషము లెడ
నున్నను నన్నిగ్రంథము లందును భాష సలక్షణమైనది. రచన చ
నిది. శశిరేఖాపరిణయ రచన యన్నిట నుత్తమమైనదిగాఁ దోఁచు.

గ్రంథవిస్తరభీతిచే ముఖ్యములైన మూఁడున్నర వజ్రముకథ
శశిరేఖాపరిణయ రచనయు, విశేషము లితరములనుండియు నుదా
రింతును.

1. మూఁడున్నర వజ్రము: ఈ కథకు మూల మేదియో తెలియదు. ఏ చిత్రభారతమునో చూచి యీకవి కల్పించిన దే యగు నేమో! పాండవు లరణ్యవాసము చేయుచుండిన కాలమున నారదుఁ డొకపరి కృష్ణుని జూడవచ్చును. కృష్ణుఁ డాతని భూత, భవిష్యత్కాలముల భువి నెందుఁ గానఁగఁ దగనట్టి నూతన చిత్రకథ నొకదాని విన వేడుక గలిగి యడుగును. నారదుఁ డాకథను యథార్థముగా సంఘటింపఁ జేయు ప్రయత్నమున బయలుదేరును. రుక్మిణికడ కేఁగి యట సత్యభామను బొగడును. బలరాము నింటి కేఁగి యతఁడు హాలామదోన్మత్తుఁడై తన్నె యుద్ధమునకు రమ్మనఁగాభీముఁడు నీబలగర్వ ముడుపఁగలవాఁడు లెమ్మని చెప్పి పోవును. పాండవమారణతంత్రపరుఁడై యున్న దుర్యోధనుని కడ కేఁగి సేమ మడుగును. అతఁడు "భీముఁడు జీవముతో మహి నుండఁగ సేమ మెట్లు మముఁ జెందు మహాత్మా" యని, యెట్లయిన భీమునికి శౌరికిని బోరు ఘటింపు మనును. దుర్యోధనుని దురాలోచనకు లోలో వెక్కసపడియు నట్ల యగుఁగాక యని నారదుఁ డిక భీష్ముని సత్యసంధతను బరీక్షించుట కరుగును. ఇందుఁ గవి భీష్మునకు నొకభార్య నంటగట్టినాఁడు. నారదుఁడు భీష్మునిమాటజారునట్లు చేసి యామెను గాంక్షించును. ఆమె వికృతాకారుఁడగు నారదుని కడకుఁ బోనొల్లక దాసిని నై సేసి పంపును. నారదుఁ డది యెఱిఁగి భీష్మపత్ని నొకగుఱ్ఱమవు కమ్మని శపించును. భీష్ముని వేఁడికోలుపై 'మూఁడున్నర వజ్రములొక్కచోఁ గూడి ముట్టినంత' నిజరూపము వచ్చునని యనుగ్రహించును. భీష్ముఁడా యశ్వమును గడు గారాబముతోఁ జూచుకొనుచుండ నది యొకనాఁడు పరసీమలకుఁ బలాయన మగును. అట బుద్ధిరాజను నాతఁడు దానిని బంధించును. అది కడు గొప్పగుఱ్ఱ మెవ్వ రడిగిన విడువవల దని యతనిని, దానిని యుద్ధముచేసియైన సంపాదింపవలె నని కృష్ణుని నారదుఁడు హెచ్చరించును. కృష్ణుఁడు బుద్ధిరాజుపై దండు వెడలును. బుద్ధి భీముని శరణుఁజొచ్చును. కృష్ణుని రాయబారములు విఫలమై యతనికిని బాండవులకును యుద్ధము తప్పదయ్యెను. నారదుని యుపదేశమున దుర్యోధనుఁడు పాండవులకే తోడ్పడును. నరునితోఁ బోరుచు నారా

యను( డలనట నటింపగా నారదుని ప్రోత్సాహమున రుక్మిణి
నరకుని మార్కొనినట్లు తా నరుని మార్కొనును. అది య
నారదుఁడు భీముని బలరామునిపైకి రొప్పును. గుఱ్ఱమును విడిచి భీమ
తలపడి బలరాముని బడగొట్టును. కృష్ణుఁ డది తెలిసి గుఱ్ఱముతలఁ బ
భీముఁడు మెడఁ బట్టును. బలరాముఁడు లేచి తోఁకపట్టి లాగును. ది
ధనుఁడు కాళ్లు పట్టుకొనును. అట్లా నలుగురి సిగపట్లగోత్రములో
తముగా నాయశ్వము మానవ స్త్రీ రూపము దాల్చును. భీమ
వచ్చును.

తోహర. 'హరిబల మారుత లరయవజ్రముల్
కురుపతి యరవజ్రం బనుచు
ధరణీశ్వర గణియించెద రార్యులు
తద్బలముల గనుగొనుచు.'

అని మూఁడున్నర వజ్రముల యర్థమును నారదుఁడు విశదీకరిం
కథలో ననౌచిత్యము లటనట నున్నను, ఆ చిత్రమైన సన్నివేశకల్ప
నా రచనయుఁ జమత్కారావహముగ నున్నవి.

2. శశిరేఖాపరిణయము,

గ్రంథారంభము :

జయహయవదన జయ రిపు మదన
ద్వయనము పాసక భయహర సదన
శ్రుతి తతిగేయామృత సితకాయ
సితగళ శతధృతి ధృతి నిరుపాయ ౧ etc.,

కథా ప్రారంభము :

తోహరా. దేవా శశిరేఖాపరిణయ కథ
తెనుఁగు యక్షగానముగాఁ
గావించెద నాకర్ణింపుము భవ
త్కారుణ్యా ధీనముగా.

కథ జనమేజయునకు వైశంపాయనుఁడు చెప్పినట్లుగలదు. కాని
మున నీకథ లేదు. అయినను బ్రసిద్ధమైనది.

గ్రంథాలయము :

తోహరా. 'బాగుగ శశిరేఖా పరిణయకథ భోగిరాడ్గిరిపతికొప్పగ
బాగేపల్లి యనంతరాముఁడను భగవద్దాసుఁడు చెప్పెగ।
వ్యయసంవత్సర వైశాఖశుక్ల గురువాసర సంయుతదశమిగ
జయకరమగు నీకథ ముగించెను హనుమదనుని దయకలిమిన్.

మంగళం - కాంభోజి - ఆది.

'మంగళం శ్రీకృష్ణ రంగనాయకి ప్రియ ।ప॥
అంగజారినుత విహంగవాహనా జయ మం. అ॥ ప॥
ఈశ మేడిపురీవాస భాసురమందిర
వాసవ సన్నుత దాసపోషక ॥జయ॥

(ఉపక్రమోప సంహారములన్నిట నిదేతీరు)

ఒక ఉదా : బలరాముఁడు తన కూఁతును దుర్యోధనపుత్రున కిత్తు నని చాటింపగా సుభద్ర కృష్ణునితో నన్నమాటలు :

ధన్యాసి - అట.

'అన్యాయ మొనరింతురా అన్నా యిటు ।ప।
అన్యులిగా నభిమన్యుని చెయివిడిచి॥
కన్నాకులై యిద్దరు అన్నలు నాకున్నారు పెన్నద్దులు
నిన్నుబోలిన యన్నలు జగమెన్న లేరని
యెన్నుచుండఁగ మొన్ననీవు వినంగ మన పె
ద్దన్న యాడిన దాని దలఁపక॥' etc.,

ఇదీ ఘట్టము, ఘటోత్కచాభిమన్యుల యుద్ధ ఘట్టము. కడు చక్కఁగనున్నవి. యక్షగానమని పేర్కొనఁబడినను నిందు ద్విపదలులేవు. తోరాలు 142 గలవు. షట్పదు లొక యాఱు వాడఁబడినవి. అవి ద్విపదలకు బదులేమో! అది కన్నడదేశ సామీప్య ప్రభావమేమో! అనంతరామాచార్యుల కృతులలో నెందును తోరాలేగాని డోరాలులేవు. ఆ రెండిటి గతులు నిరుగు పొరుగుగా నుండును. అసలు రెంటి పేర్లును ధ్రువాశబ్దభవములే యగునేమో!

3. విశేషములు!

లావణి యొక్క మహారాష్ట్ర పదచ్ఛందము. కాని య
రామాచార్యుల కృతులలో నది రాగ విశేషముగా వాడఁబడినది
ప్రహాన చరిత్రలో (ఆదితాళమున)

పరిపంథి రాజుల నెల్లఁ
పరిమార్ప నంతట వెళ్లెఁ ॥పల్లవి॥
భండన పండిత భట సమూహములు
చండవేగ బహుకాండ నివహములు
కొండలసరి వేదండ యూథములు
మండిత రథచర దండ నాయకులు
గండు మిగిలి భూమండల మదరగ
నిండినడువ పరిమండలి బెదరగ॥ etc,

'గజల్' అన్నదొక పార్శీమట్టు. అదియు నిందొక రాగముగా ను
రింపఁబడినది. (చఁ॥ చ॥లో ఆదితాళములో)

'మంత్రీశ్వర. దయతోడ మా మనవిని వినవలయు
వింతగాదు హరిదాసుఁడీ వేషంబున వెలయు ॥అ. ప॥

కంద పద్య మీ కవికి మిగుల ప్రియమైనది. త్రచన రుచి గొ
న్నది. అనసూయా చరిత్రమునుండి యొక ఉదాహరణ: (సంద
ముగు రయ్యలను పసికందులను జేసిన యనసూయ కడకు వారి భా
పతిభిక్ష కొఱకు వత్తురు. అపు డనసూయ వండుకొనుచు పిల్ల లేఁ
న్నను చెయి తీఱికలేక వచ్చినవారిని జూచి యిట్లనుకొనెనఁట)

'పాపలకుఁ బాలు పోయఁగ
నీ పణతుల కేను జెప్ప నే మందురొకో!
యీ పని కెటు సేయుదునని
తాపన సతి కొంతసేపు తలపోసె మదిఁ॥'

ఈ పద్యమునఁ జమత్కార మెంతైన నిమిడియున్నది.

కుచేలోపాఖ్యానమునుండి యొక రెండు రచనా విశేషముల కుదాహరణములు:

నాటురాగము—రూపక తాళము:

'ఉపహార మేదియైన దెచ్చియున్న వాడవో ॥ప॥
నెప మేదియైన దలంచి నన్ను గృపను జూడవో' ॥అ॥

తిల్లాన తరగతి : ఆదితాళము.

'మఱచితో విప్రాగ్రగణ్య ॥ప॥
ధరణీ సురా విరాగి వర ॥అ. ప॥
సమిధలకై గురుపతి మము నంపగ
విమల మతిక్ష విపుల మతిక్ష జనుట॥' etc.,

సావిత్రి చరిత్రమునుండి షట్పది కుదాహరణ:

'అశ్వపతి యను తొల్లి మద్ర మహేశ్వరుండు తేజరారు నిస్తుల
శౌర్యైశ్వర్యాదులను హరి దశ్వ తేజుండు॥' etc.,

సుభద్రా పరిణయమునుండి యొక వర్ణన కుదాహరణ:

సీ॥ 'ఇదిగదా శ్రీ రమా ధీశ్వర పాదార
విందసంభృత మకరంద బిందు
యిదిగదా కపిల మునీంద్ర కోపానల
దగ్ధసాగరపుణ్యధామసరణి
ఇదిగదా సకల బర్హిర్ముఖాంబుజ ముఖి
సముదయాభీష్ట మజ్జన గృహంబు
ఇదిగదా హైమవతీశజటాగ్ర వి
స్ఫురి తాభినవ సితాంబుజ దళంబు

గీ॥ ఇదిగద నిమజ్జ నాగతానేక సుజన
సంఘ దురితాంధకార పూషాయు తాతి
విమల తరవారిపూర సంభృత తరంగ
గంగ భవభంగ ధవళాంగ కమల సంగ॥

---

# శ్రీ మద్రామాయణము—మానవత్వ ప్రతి

శ్రీ భమిడి సత్యనారాయణ శర్మ.

శ్రీరామచంద్ర పాత్రమునుగూర్చి రచించుటకుఁ బూర్వ
దిఁక నొక్క విషయమునుగుఱించి దశరథపాత్రములోఁ జేరొ
తప్పదు. ఆ నృపాలుఁడు విశ్వామిత్రయాగసంరక్షణార్థము రా
బంపుటను మనము గొంత పరీక్షింపవలెను. శ్రీ శ్రీనివాస శా
రధిక్షేపించినటుల దశరథుఁ డుద్రేకముతో వాగ్దానము నొనరించి పి
పశ్చాత్తప్తుఁ డయ్యెనా? లేక నాసందర్భమున మనము గ్రహిం
సిన విశేషాంశము లేమైన నున్నవా? తొలుదొల్త "నీవెద్ది
సద్దాని నంతయుఁ బూర్తిగఁ జేయుదు" నని చెప్పిన దశరథుఁడు శ్రీ
నిమ్మని యా మునివర్యుఁడు కోరుటచే నాతఁడు దన పుత్రు
టకుఁ గేవలపుత్రవ్యామోహపీడితుఁడై నిరాకరించెనా? లేక
మిత్రుని కోర్కె యసంగత మని నిరాకరించెనా? మరి యే
ప్రబలతర కారణము లైనంగూడ కలవా? అను విషయములు
మనవి చేసెదను.

దశరథునియట్టి ధీరోదాత్తుఁ డా తీరున విశ్వామిత్రునికిఁ
పుత్రు నీయ వెనుకంజ వేయుటకు మూఁడు ప్రబలకారణములు
ఇఁక నాల్గవది సూక్ష్మతర మగు ధర్మములోని పరమార్థము.
మొదటిది నే నీవఱకు నా పూర్వవ్యాసమునఁ జేర్కొన్నవిషయ
దశరథునకు శ్రీరామచంద్రవియోగముచే మృత్యువు వాటిల్లు
యను భీతి. అయ్యది యాతనిహృదయమును నిరంతరము వేధించు
డిన పరమరహస్యశల్యము! అరువది వే లేండ్లు రాజ్య మొనరించి
లేక కన్న పుత్రరత్నముల వివాహమహోత్సవమును జూడకుం
లోకము నెట్లాతఁడు వీడఁగలఁడు? "అంగం గలితం, పలితం ము
...తదపి న ముంచ త్యాశాపిండం" అను శంకరభగవత్పాదుల వా

నాలోచితములా? శంకరునినాఁడుమాత్రిమే యీయనుభవవాక్యములు
ఫుట్టెనా! దశరథునియట్టి ప్రఖ్యాతపురుషులచారిత్రిములను జదివియే
యీ బుద్ధిశాలి రచించెను. మానవుల కామరణాంతము నెవ్వియో
కోరిక లుండుటయు నయ్యవి వారు వృద్ధు లగుచున్నకొలంది వృద్ధి
గొందుటయు లోకస్వభావము. దశరథుఁడుమాత్రము లోకస్వభావము
తటుల వీడఁగలఁడు. "స్వభావస్థ మిదం సర్వం సదేవాసురమానుషం"
అని శ్రీకృష్ణభగవానుఁ డుద్ఘాటించియున్నాఁడు! కాకున్న నింద్రుఁ
డహల్యాజారుఁ డెట్లగును? కావునఁ దనకుమారులకు వివాహము
చేయఁదలపెట్టినట్టి శుభసంతోషసమయంబునఁ దన యజ్ఞసంరక్షణ
మను నేరుతో ఘోరరాక్షససంహారమునకు ముక్కుపచ్చ లాఱని
బిడ్డలను గొనిపోవ వచ్చిన విశ్వామిత్రునికోరిక యశనిపాతమువలె దశ
రథునకు గోచరించి యాతనిమానసమును గలంప కెట్లుండును? ఒక
వంక పుత్రవ్యామోహాంధకారము; దానికిఁదోడు స్వమరణభీతి. "శుభము
లుకరాఁబోవుచున్నా! యనిన అవి రేణికుండలకాడ చచ్చినట్లు తోఁగుండు'
ను సామెతవలె శుభాకాంక్షసమయమున రక్కసులతోఁ బోరాటమా!
ఇంతకన్న నశుభవార్త యే మున్నది? ఏ తల్లిదండ్రుల గుండెలవియవు?

దశరథుఁడు పరమలౌకికశిఖామణి. అనేకయుద్ధములం దాతి
కేతిన వీరుఁడు. కాని పుత్రవిషయమునను, సంతునను లేకలేక బహు
ప్రయాసముపై సాధించిన పుత్రోత్పాదనము నాతఁ డెట్లు మఱువఁ
గలఁడు? తుద కటునిటు జూచి క్షత్రియజాతియం దుద్భవించినవాఁడ
య్యును నీవు పదునాఱువత్సరములకన్నఁ దక్కువ వయస్సునం
దుండిన బాలుని యుద్ధమునకుఁ దీసికొనుపోవుటయు క్తమా యని ముం
దుగ విశ్వామిత్రునికోర్కె యసంగతము, నస్థానము నని యీ తీరున
వర్ణయించెను:—

శ్లో. ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః
న యుద్ధయోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసై

ముందుగ విశ్వామిత్రుని యభ్యర్థనమే యనుచిత మని
యటుతరువాతఁ దన మరణభీతిని వ్యక్తపఱచెను.

శ్లో. 'విప్రయుక్తో హి రామేణ ముహూర్తమపి నోత్స
జీవితుం మునిశార్దూల న రామం నేతు మర్హసి'.

ఈశ్లోకమున విశ్వామిత్రుని "మునిశార్దూల" యని దశరథుఁడ
ధించుట గమనింపఁ దగిన విషయము. "మేము శుభము నా
చుండఁ బెద్దపులివలె నెచ్చటనుండి వచ్చితివయ్యా! మా బిడ్డల
పోవుట కను హృదయావేదనము నా శబ్దమునూచించుచున
వంక విశ్వామిత్ర స్తవము, వేఱొకవంక నాతనిది క్రూర మగు
మను నింద' అదీ వాల్మీకిశబ్దప్రయోగములలోని స్వారస్యసౌష్ఠ
ఇట్టివి రామాయణమునందుఁ గుప్పలుతిప్పలుగ నున్నవి. అన
తయారుచేయుటలోఁ గాళిదాసుకు వాల్మీకి వరవడిఁ బెట్టె నను
సోక్తి కాదు. ఈ రీతిగ విశ్వామిత్రునియసంగతవాంఛయుఁ
మెల్లమెల్ల వెళ్ళఁగ్రక్కెను. దశరథుఁడు పైశ్లోకమునందు,
శాపముచేఁ దనకు మరణము సంభవించు నను భయము ధ్వ
న్నదేకాని నిజమున కాశ్లోకములో దశరథునకు రామునియం
ప్రేమ యనిమాత్రమే పైకి పరిస్ఫుట మగును. కావ్యమునకు
జీవముకదా. తుద కొక్క మాటలో :—

శ్లో. "కథ మప్యమరప్రఖ్యం సంగ్రామాణా మకోవిదం
బాలం మే తనయం బ్రహ్మ న్నైవ దాస్యామి పుత్రకం
(1

అని పూర్తిగ నిరాకరించెను. దశరథుఁడా మునిశార్దూలునికో
అటు లుద్రేకపూరితహృదయముతో నాతఁడువిశ్వామిత్రార్థము

ు మానవధర్మవ్యతిరిక్త మెంతమాత్రమును గాదు. ఎంతటి
ారస్వభావుఁడైనను దనమునయుక్తములగు కోరిక లర్థి యడుగునని
ొనఁడుకదా! "నీకేమి కావలసిన నిచ్చెద" నని యొక యుక్తుఁ
ఋషిపుంగవునితో దాత యగు ప్రభు వనునప్పు డా మునివరుఁ
క్తము లగు కామ్యముల నర్థించు నని యెవ్వఁ డనుకొనును ?
ధర్మయుక్త మగు దానమును మాత్రమే సేయుట విధి గాని
్యతిరిక్తము లగు వాంఛలను దీర్పఁదలంచుట కర్ణాకుల దానము
నాత్మవినాశహేతువు. అట్టి దానముల నెన్నఁడును వేదము లంగీక
ీదు. తన కున్నదానిలో న్యాయము దప్పకుండ నర్థశాస్త్రము
వ్యతిరేకము గాకుండ నిచ్చుటయే వేదమతము. ఇందు దశరథుఁడు
ుడి చేసిన వాగ్దాన మే మున్నది ? కైక రాము నరణ్యవాసమున
ు మను కోర్కెకన్న విశ్వామిత్రునియర్థము మిగుల సంకటహేతు
టలో నాశ్చర్య మేమి ? వనవాసమునకుఁ బోవునప్పుడు శ్రీరాముని
ద్దై దేండ్లుండెను. అప్పటికప్పుడే శంబరాదులతో యుద్ధ మొన
ు వారిని సంహరించిన ధీరుఁడు రాముఁడు. విశ్వామిత్రాభ్యర్థనకా
ునఁ బదిరెండేండ్ల బాలుఁ డాతఁడు! మారీచసుబాహ్వాదులతోఁ
ుట సామాన్యవిషయమా ? వారి వెనుక రావణుఁడుకూడ నుండె
విశ్వామిత్రుఁడే వెలిబుచ్చెను. రాక్షససంహారము జరిగి తుదకుఁ
పుత్రులకు వివాహముగూడ నగు నని దశరథుఁ డూహించుట
కకు ఋషి యా? కావున నక్రియ మగు విశ్వామిత్రాభ్యర్థనము నిరాక
చిన దశరథుని మనము గర్హించుటకాని యధిక్షేపించుటకాని తగదు.
రథుఁడు శిబి, కర్ణ, బల్యాదులవలెఁ దన సర్వస్వము నర్పింపఁబూనితి
దానకంకణము గట్టుకొని సర్వసంగపరిత్యాగ మొనరింపఁ దలం
మోక్షార్థి కాఁడు. అటులైన "కార్యస్య న విమర్శంచ గంతు
ర్హసి కౌశిక! కర్తా చాహ మశేషేణ దైవతం హి భవాన్మమ'

(1-19-56) అని తన కార్యమునంతయుఁ జేసెద నని దశరథుఁ
డుగ నేలఁ జెప్పవలె నందురా? అయ్యవి యుపచారవాక్యా
ప్రతిగ్రహీత గ్రహింపవలెనే గాని యథాక్షరసమన్వయము
దుష్ప్రాప్యము లగు వస్తువులను గోరుట యుక్తమా? ఉచి
మహానుభావు లగు నతిథులు మన గృహముల కరుదెంచినతతి
స్తోత్రము సేసి మీ కేమి కావలె నని గృహస్థధర్మము ననుసరించి
గుట తప్పా? అంతమాత్రమునం బ్రతిగ్రహీత దాతయాదార
దుర్వినియోగ మొనరించుటకుఁ జూచుట ధర్మమా? చూ
అగస్త్యుఁడు సీతారామలక్ష్మణులు దన యాశ్రమమునకు వచ్చి
వారి కతిథిసత్కారము సేయు టొక యుత్కృష్టధర్మ మని చె
నీ తీరున బోధించెను:—

> శ్లో. అగ్నిం హుత్వా ప్రదాయార్ఘ్య మతిథిం ప్రతిపూజయే
> అన్యథా ఖలు కాకుత్స్థ, తపస్వీ సముదాచరన్
> దుస్సాక్షీవ పరే లోకే స్వాని మాంసాని భక్షయేత్
> (3-12

అర్థాని పరమార్థమును గ్రహించిన సీతాదేవిని యతిథివేష
వచ్చిన రావణుఁ డెటుల మోసగించెనో జగద్విదితము. కావున
భ్యాగతులను వివేకించి వారికిఁ బూజ లొనరింపవలెనే కాని "కా
దండమాత్రేణ యతిః పూజ్యో న సంశయః" యను వార్యోక్తి
రించి ప్రతికుహనాయతిని గృహస్థుఁడు పూజించుటకు సిద్ధపడ
ప్రఖ్యాతుఁ డగు ఋషిపుంగవుఁడు తన గృహమున కరుదెంచినం
విశ్వామిత్రుని సగౌరవముగా దశరథుఁడు సమర్థుఁ డగు వదా
డగుటచే మీ కేమి కావలసియున్న వాని నన్నిటి నిచ్చెద నని వ
చ్చెను. అదియే వైదికధర్మపరిపాలనమునందలి పరమార్థము. అ
లకుఁ దార్కాణముగా నా యగస్త్యుఁ డేయేమి చెప్పెనో చూడుఁ

శ్లో. "రాజా సర్వస్య లోకస్య ధర్మచారీ మహారథః
పూజనీయ శ్చ మాన్యశ్చ భవాన్ ప్రాప్తః ప్రియాతిథిః"
(3-12-30).

శ్రీరాముఁడు ప్రఖ్యాతక్షత్రియపుంగవుఁడును ధర్మచరిత్రచరితుఁడును
వునవే యాతని నా యగస్త్యుఁడు పూజించెను. దానిరహస్య మెఱుం
సీత తన పర్ణాశ్రమమునకు వచ్చినయతిథి యెట్టివాఁడో యెఱుంగక
ని నారాధించుటవలనఁ బూర్తిగఁ బరాభవింపఁబడెను. కావున నీ
శ్వామిత్రాభ్యర్థనఘట్టము గృహస్థధర్మమును నిర్వర్తించు మానవు
టుల మెఱంగవలెనో, యాచకు లెట్టి కోరికలను మాత్రమే కోరవ
నో, దాత లెటుల దమ ధర్మమును నిర్వర్తింపవలెనో, మనకు బోధిం
చుచున్నది. ఇచ్చట దశరథుఁ డొనరించిన వాగ్దాన మొక ప్రతిజ్ఞగా
నము గ్రహింపరాదు.

ఇఁక నొక్క విశేషముకూడ నీ ఘట్టమున మనకు గోచరించు
మన్నది. జాగరూకతతో మనము విశ్వామిత్రుని ప్రవర్తనము నా సం
దర్భమునందు గమనించితిమేని యాతనియహంకారపూరితహృదయమే
మాతనియాచ్ఞాపరిపూర్తి కాటంకము కలిగించెననుట నిర్వివాదము.
తా నర్థియై వచ్చికూడ నే తీరున నా నిండుసభలోఁ దన యపూర్వ
ప్రతిభాసమున్మేషము నుగ్గడించుకొనెనో మనము కనుగొంటిమేని యా
మహాత్ము నింకను రజోగుణలేశమువలని యౌద్ధత్యము వీడలే దని మనకుఁ
దోఁపక మానదు!

శ్లో. "అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం
వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః (1-19-24).

వసిష్ఠవామదేవజాబాల్యాదులు గూర్చుండియున్న యా మహాసభాభవ
నమునందు రాముఁ డెవ్వఁడో నే నెఱుంగుదును. వసిష్ఠుఁడుగూడ
నెఱుఁగును. ఈ తాపసులకును దెలియు' ననుట కేవల మాత్మోన్మక్

ర్షము నా ఋషిపుంగవుఁ డుగ్గడింపఁదలంచుటయు సాహసము కాదా
తొలుతనుండియు శ్రీరామచంద్రు నీ లోకమునం దవతరింపఁజేయుట
సమకట్టి దశరథుఁ డొనరించిన యశ్వమేధము మొదలు పుత్రకామే
వలకు నుపద్రష్టలై సాగించిన వసిష్ఠవామదేవాదులముందుఁ దా
రీతి గుండె బాదుకొనుచు "రాముని నే నెఱుంగుదు" ననటలో నెం
యహంభావ మాతఁడు చూపించెను! చూడుఁ డాసమయమున వసిష్ఠ
డే తీరునఁ దన మహత్తరసాత్త్వికప్రవృత్తిని వీడక పరమశాంతచి
ముతో మెలంగి యా వికలహృదయుఁ డైన దశరథుని బుజ్జగించెనో

శ్లో. "కృతాస్త్ర మకృతాస్త్రం వా నైనం శక్ష్యంతి రాక్షసాః
గుప్తం కుశికపుత్రేణ జ్వలనే నామృతం యథా".

శ్లో. "ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః
ఏష బుద్ధ్యాధికో లోకే తపసశ్చ పరాయణం' (1-21-9&10

ఆహా! ఏమి యా పరమసాత్త్వికవైదిక శిఖామణివినయము! విశ్వా
త్రుని దివ్యాస్త్రసంపద నంతయుఁ దృటిలోఁ దన బ్రహ్మదండము
నుపహత మొనరించి యాతనియుద్రేకము నంతయుఁ బూర్తిగ నణం
వైచిన యా బ్రహ్మఋషివచనరచన యెంత గంభీరభావవిలసితము
విశ్వామిత్రుని "ఏష తపసశ్చ పరాయణం" అను వసిష్ఠవాక్యము
విశ్వామిత్రునిహృదయము నెటుల తాఁకెనో యా నాఁటిసభయం ద
డిన వామదేవజాబాల్యాదు లెఱుంగుదురు. కాని మన మెట్లూహిం
గలము! వసిష్ఠుఁ డొక సంపూర్ణామృతఘటము. అయ్యది తొణఁకద
బెణఁకదు. అట్టి పరమసాత్త్వికునివద్ద నిరువదై దేండ్లు వచ్చువఱ
శుశ్రూష లొనరించిన రామచంద్రునిపరమసాత్త్వికసంపదకు వేఱుగ
బ్రతిష్ఠాపత్రము కావలెనా? విశ్వామిత్రవసిష్ఠపాత్రలనుగూర్చి ప
మర్శించునప్పు డా విశేషములను బాఠకమహాశయుల కందఁజేం
యత్నింతును. ప్రకృతమున నా యహంకారపూరితవిశ్వామిత్రాభ్య

మును దశరథుఁడు నిరాకరించుటలోఁ దప్పేమి ! ముష్టికి వచ్చిన యాతఁడు బ్రహ్మఋషియే కానిండు. ఆతఁడు లోకోపకారార్థమో, తన యశస్సంపాదనార్థమో, యాచింపనిండు. నేను జాల గొప్పవాఁడను గావున నీవు నా కోరిన వస్తువు నిచ్చితివేని నేను నిన్నుద్ధరింతు ననియు లోకము నుద్ధరింతు ననియుఁ జెప్పి తన యౌద్ధత్యము నహంకారమును జూపుట ధర్మము కాగు. అట్లు మేము చాల గొప్పవారము కాని నేఁడు మీా వద్దకు యాచింపవచ్చితి మనుట రజోగుణదూషిత మగు యాచ్ఞ గాని సాత్త్వికార్థన మనిపించుకొనదు. చూడుఁడు ! తుదకు వసిష్ఠుఁ డడ్డుపడి దశరథున కుపదేశించినఁ గాని యా నరపాలుఁడు విశ్వామిత్త్రు నకుఁ దన తనయుని నీయలేదు. ఈ నాడంబరముతో శ్రీమునితత్త్వ మెఱుంగుదు నని విశ్వామిత్త్రుఁ డనినంతమాత్త్రమున దశరథుఁ డాతని నమ్మెనా ? శ్రీరామచంద్రునిపుట్టుకపూర్వోత్తరములు పూర్తిగ నెఱింగిన వసిష్ఠునియుపన్యాసానంతరము విశ్వామిత్త్రుని యహంకారము పూర్తిగ నణంగినపిమ్మటనుగాని శ్రీరామచంద్రునిదర్శనముగూడ నా ఋషిపుంగవునకుఁ గలుగలేదు ! అంతటనుండి సీతాకళ్యాణానంతరము విశ్వామిత్త్రుఁడు కౌశికీతీరమునకుఁ బోయి యచ్చట దన నింకను బీడించుచుండి యా యత్కించిదహంకారమునుగూడఁ బూర్తిగ నిర్జించుటకే వెడలియుండె నని నా మనవి. ఆ శ్రీరామాభ్యర్థనఘట్టమునం దెంత విశేష మున్నదో మన మీా తీరున గ్రహింపఁగలము. అటు విశ్వామిత్త్రునియజ్ఞసంరక్షణము, నిటు రావణవధ మహానాటకమునకు నాంది యటువసిష్ఠునినిరతిశయసాత్త్వికసంపద లోకమునకుఁ జాటుట, దశరథుఁడు తలంచిన తన పుత్త్రవివాహవైభవమునకుఁ బునాదియుఁ బ్రతిష్ఠింపఁబడి యంతటినుండియే నిజమగు శ్రీరామచరిత్త్ర శ్రీమద్రామాయణము ప్రారంభ మయ్యెను.

ఇఁక దశరథపాత్త్రవలన మనకుఁ బ్రధానముగ గోచరించెడి విషయములు మూఁడు కలవు. అందు మొదటిది ధర్మవ్యతిరిక్త మగు

కామోద్వేగమువలన నెంతటి ధీరుఁడైన ధర్మరతుఁడైనను
క్రమముగఁ బ్రమాదపరిస్థితులందుఁ జిక్కుకొని దుర్మరణముపా
మానఁడు. స్వభార్యయందుఁగూడ నిగ్రహముతో మా
ప్రవర్తింపఁడేని మన మంచిన దీపముకదా యని ముద్దిడఁబోవ
కాలినట్లుగఁ బరాభవము నొందఁగలఁడు. అట్టివాని కెట్టి మనోనిగ్ర
గూడ నుండదు. చూడుఁడు! ఎంతయో నిగ్రహదీక్షతోఁ గైక
సాధించిన దశరథుఁడు తుదకు "స కామవశ మాపన్నః రత్యర్థం
జాధిపః" యనినట్లు కామార్తుఁడై పూర్తిగఁ గైకవలలోఁ జిక్కు
విశృంఖలముగాఁ దన స్త్రీయందైనఁ బ్రవర్తించువాని కెట్టి మహ
ర్యము సాధించుటకును శక్తి యుండదు. తుద కాతనిదైనందినజీ
గూడ దుర్భరమై నిరంతర మెద్దియో యొక యాపద తనకు
నని యూరియాడుచుండు నాతని హృదయము. సమస్తభోగ
మగు సామ్రాజ్యము నేలుచుండియు దైవాసురయుద్ధములం
నంతవానికి సాయపడ సమర్థుఁడగు వీరుఁడయ్యును నిర
ప్రేమాస్పదు లైన పరమపతివ్రతలు తనకు భార్యలుగ న
దశరథునిజీవితము రామాయణమునుబట్టి చూడఁగ నంత
స్పదసంఘటనముగ మనకుఁ జూపట్టదు. కొనకు మృత్యుకా
నందుఁ గూడ శ్రీరామచంద్రునియట్టి తనయులను గాంచిన నృ
కగ్నిసంస్కారము నకాలమునఁ జేయుట కెవ్వరు లేరయ్యె! దీని
నాతనియందుఁ జూపట్టుచుండిన దుష్టకామమే కారణ మనక త
ఇఁక రెండవది పుత్రవ్యామోహము మిక్కుట మయ్యెనేని
యే తీరునఁ దన జీవితసుఖమును గోల్పోవుటయేకాక పరమార్థ
ధర్మమునుగూడఁ ద్యజింపవలసివచ్చునో యను విషయము. పు
తనకు లేరను తహతహచే నా నరపతి రాజ్యశుల్కవాగ్దాన మొ
- కైకను వివాహ మాడెను! వంశక్రమానుగత మైన రాజ్యము

ముగఁ గై కేయిపుత్రుని కా నరపతి యీవలసియుండెను. అయ్యది
ర్మశాస్త్రవిరుద్ధముకాదా ? వంశక్రమానుగత మగు ధర్మముగతి
యేమి ? అది యటులుండ నాతఁడు సర్వదా పుత్రవ్యామోహ పీడితుఁ
గుటచేఁ దన కుమారులపై నీఁగ వ్రాలునేమో యని నిరతము వ్యథఁ
ెందుచుండెడివాఁడు. మన పుత్రపుత్రికాదులు గుణవంతులై, ధర్మ
ాములై, నైశ్వర్యవంతులై మనకు మిత్రులుగ నుండి సుఖహేతువు
ంగ నుండరేని వారిని మిత్రఋణస్థులుగ మాత్రము మనము
గ్రహించి వారినిదూర మందుండి వారియభివృద్ధిని గాంక్షించుచు వారి
యందు మిత్రభావముతోడనే క్రమక్రమముగ మన తగులాటమును
డపవలెనుగాని, వారి సుఖదుఃఖములందు మనము గూడఁ బొల్గొనుచు
మగ్నుల మగుదుమేని ధూర్జటికవి రచించినటుల "సీల స్సీల యమర్చిన
ాసఁగితో శ్రీకాళహస్తీశ్వరా!" యని విచారింపవలసివచ్చును. ఇఁక
ర్భాగ్యులై శత్రువు లగుదురేని సగరచక్రవర్తి యసమంజుని విడిన
ట్లుగ మనము వారిని వదలి దూరమునకుఁ బోవవలెను. ఎప్పటికైన నీ
ాంచభౌతిక దేహము నశింపక తప్పదని యెఱింగిన ప్రతిమానవుఁడును
క్రమక్రమముగఁ దన జంజాటమును వయస్సు మీఱినకొలంది విడువ
లెనంపఁడేని యయ్యవి యాతనికిఁ బ్రబలతరయాతనా హేతువులై
ృత్యుకాలమునందుఁగూడ వేధింపకమానవు! అందుచేతనే కాళిదాసు
శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణాం। వార్ధకే ముని
వృత్తీనాం యోగేనాంతే తనుత్యజా" మని నుడివెను. దశరథుఁ డటుల
ాక తొలుత సంతానముకొఱకును, పిమ్మట వారి ముద్దుముచ్చటలం
ాచి యానందించుచును, నటుతరువాత వారి పెండ్లిపేరఁటముల కొఱ
ును, ననంతరము వారి పట్టాభిషేకమహోత్సవములందును, నీ రీతిగ
ొక కోరికనుండి వేఱొక వాంఛకుఁ దీఁగెలుసాగ నలముకొను చుండునే
ాని తన యాసన్నమృత్యువునుగూడ సరిగ గమనింపలేదు. ఒకవేళ

ననేకవిధములఁ బ్రకృతియందలి యుత్పాతములు తనకుఁ గలిగిన స
దులయందలి దుర్నిమిత్తములు సూచించుచుండినను దా నెద్దియో
హాకత్వ మింకను వహింపవలె నను నహంకార మమకారములను,
వ్యసనములను వీడఁజాలకుండుటచే నాతనిమరణముగూడ దుఃఖ
మయ్యెను! కావునఁ బితృపుత్రికాదులందు మానవుఁడు క్రమ
ముగ మమకారము నుపహరించుకొనుచు నిష్కామకర్మాచరణదీ
డయ్యెనేని దశరథునివలె దుఃఖించుచు నీ లోకమును వీడకుండఁగ

ఇఁక మూఁడవది గుణవతు లగు భార్యలను వదలి తన
యంతయు రూపవైభవము గల యాడుదానియందు లగ్నముచే
వలన నా నరపతి యెటుల ముప్పునఁ దిప్పలపా లయ్యెనో గమ
దగినది. దశరథుని ముగ్గురుప్రధానభార్యలలోఁ బట్టమహిషి
కౌసల్య యద్వితీయ, వీరమాత, మహాపతివ్రత, సుగుణరాశి,
మూర్తి. తన కశ్వమేధాదికములందుఁ దోడునీడగ నుండి యు
చిన మహత్తరశ్రద్ధాభువు. ఆమెనుగుఱించి ప్రత్యేకముగ నా
పాత్రవిమర్శనావసరమునఁ బ్రసంగింతును. అట్టిసుగుణఖని
కౌసల్యను వీడి, వేరొకవంక గేవలమహాయోగిని యట్టి సు
దోసిరా జని తుచ్ఛభోగలాలసత్వముచేఁ బాంచభౌతిక మగు
మునందలి రూపసంపదచే నాకర్షింపఁబడి కైకయందుమాత్ర మ
రాగానుబద్ధుఁ డగుట దశరథునియట్టి వివేకవంతునిలక్షణమా?
కామె యా వృద్ధనృపతి కేగతి తెచ్చెనో శ్రీరామచంద్రుఁడే
తీరున విలపించెను :-

శ్లో. "మన్యే దశరథాంతాయ మమ ప్రవ్రాజనాయ చ
కైకేయీ సౌమ్యసంప్రాప్తా రాజ్యాయ భరతస్య చ"
(2-5

గుణవిశిష్టలౌనై భవమును వీడి కేవలగార్హస్థ్యసుఖసంతుష్టికై ప్రమదా రూపవిశేషములచే విమోహితు లగు మానవులు దశరథునివలె వంత కాలమునకు దుఃఖభాజను లగుట మనకు శ్రీమద్రామాయణము బోధించుచున్నది.

ఇవ్విధముగ రామాయణమహాకావ్యము మానవుని కరిషడ్వర్గ మేయేవిధమున నెవ్వెడెప్పు డడ్డుతగులుచుండునో, వానివలని ప్రమాద ముల నేవిధమున నరికట్టవలయునో, మాయాపాత్రములవలన వాల్మీకి నిరూపించెను. బాలకాండములోఁ గామమువలన నిజబుద్ధివిపర్యయమును, నయోధ్యాకాండమునందుఁ గ్రోధముఁవలన బుద్ధిభ్రంశమును, నరణ్య కాండమునందు లోభోపహతమైన మానవుఁ డేతీరునఁ బరాభవము నొందునో యావిషయమును,కిష్కింధాకాండంబున మోహమువలననైన ప్రమాదంబును,సుందరకాండములో మదమువలనమానవునకుఁ గలుగు భంగపాటును, యుద్ధకాండంబున మాత్సర్యముచేఁ గలుగు వినాశం బును నా కవిపుంగవుఁడు నిరూపించుచు నా యరిషడ్వర్గము ధర్మరతు లను బాధించుతఱి శరత్కాలమేఘమువలె వారికిఁ దోఁచి విడిపోవుచుం డుటయు, నధర్మపరుల నయ్యది వర్షాకాలమేఘంబువలె నేతీరున నుప ద్రవములందు ముంచునో యభివర్ణించియున్నాఁడు. ఆయా విషయముల నాయా ఘట్టములను పాత్రములను విమర్శించుతఱిఁ బాఠకమహాశయుల దృష్టికిఁ దెచ్చుచుండును.

## శ్రీ రా మ చ ం ద్రుఁ డు

అనేకదివ్యవత్సరములు నిశితతప మాచరించి మహత్తరనార దోపన్యాసము నొంది "వాగ్దేవతాచరణ చిత్రితచిత్తసద్మఁడై" స్వయం భువుండు ననాదికవియు నగు బ్రహ్మచే నాశీర్వదింపఁబడి యాదికవి యని నేటికిని బ్రఖ్యాతి గాంచిన కవిబ్రహ్మ యగు వాల్మీకిమహర్షిచే

వర్ణింపఁబడిన శ్రీరామచంద్రుని దివ్యవైభవమును నిరూపించుట
"మందఃకవియశఃప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతా" మని కాళిదాసువం
విద్వాంసుఁడు వెనుకంజ వేయ నాబోంటి కించిజ్జ్ఞుఁడా లోకాదర్
మహాపురుషపాత్రమును గూర్చి యాధునిక పాఠకలోకమునకుఁ బరిస్ఫుట
సేయయత్నించుట శ్రీరామసేతువున కుడుతపిల్ల యత్నమువంటి
వేఱుగఁ జెప్పనక్కఱలేదు. "తపస్స్వాధ్యాయ నిరతు"ఁడైన "వాగ్విద
లలో శ్రేష్ఠుఁడైన నారదుని "తపస్వి"యు, నిరంతర తారకమంత్ర
పాసకుఁడు నగు వాల్మీకి ముందుగఁ బరిప్రశ్నము సేసి యటుపిమ్మ
నవతరింపఁజేసిన యుత్కృష్టకావ్యమునందలి నాయకమణిని గూ
రచించుట కా పుట్టలోఁబుట్టినయాతనికే చెల్లునుగాని నా యట్టి వా
యత్నములు కేవలబాల్యచాపల్యముచేఁ జంద్రమండలము నందుకొ
జేతులు చాఁచునటువంటి దని యెఱుంగుదును. అట్లయ్యును భ
మురారి సెప్పినట్లుగ స్వాత్మోద్ధరణమునకై యా రామచంద్ర
స్మరించిస్మరించియు నా పతితపావనుని నామము పలుమాఱు రచిం
రచించియు నాయుదారమూర్తి గుణవైభవములను మాటిమాటి
దలంచిదలంచియైన నా జన్మము నీమన్మాత్రముననైనఁ బవిత్రముసేసికొ
నాసతో నే నీ శ్రీమద్రామాయణములోని యా యా పాత్రవిమర్శ
మునకుఁ గడంగితినేకాని సహస్రముఖవ్యాప్తమై శతకోటిసంఖ
విస్తృతమైన రామచరిత్రమున కెద్దియో యపూర్వార్థకల్పనము సే
వలె నని కాదు. అటు లూహించుట సూర్యునిం జూపుటకు మిణుఁగు
పుర్వుయత్నమువంటిది.

షోడశకళాప్రపూర్ణుఁ డగు చంద్రునివలె షోడశగుణాత్మకుఁ డ
పురుషవర్యుఁ డొకఁడు నేఁడు జీవించి యీ మర్త్యలోకమునందు
పాంచభౌతికశరీరముతో నివసించుచుండినవానిం గూర్చి తన కుపదేశిం

మని వాల్మీకి నారదు నడిగెనంట! అందు దపస్స్వాధ్యాయనిరతుం డగు మునిపుంగవుని దపస్వి యగు ఋషి యనుటలోని స్వారస్య మేమి? నారదుండు కేవలతపస్వికాక స్వాధ్యాయనిరతుండుగూడ నగుటచే వేద వేదాంగరహస్యము లన్నియు నెఱింగియుండిన నిష్ప్రాత్తికమైన బుద్ధి కలవాండు. వేదోపబృంహితము లగు మహాపురుషలక్షణములనుగూర్చి నారదుం డెఱింగినంతగ వాల్మీకికిం దెలియకపోవచ్చును. "రూప మేవాస్మి న్మహిమానం వ్యాచష్టే" యని వేద ముద్ఘోషించుచున్నది. దివ్యరూపసంపదకూడ మహాపురుషలక్షణములలో నొకటి. అందు చేతనే చతుర్వేదపారంగతుం డగు నాంజనేయుండు శ్రీరామచంద్రుని మహాపురుషలక్షణములను సువిపులముగ నిరూపించి వర్ణించి సీతాదేవి హృదయమునం దతండు రామదూత యను విశ్వాసమును నెలకొల్పం గలిగెను. ఒకవేళ వాల్మీకి యవియన్నియుం దన తపఃప్రభావముచే నెఱుంగం గల్గినను, దనకన్న నన్నివిధముల మిన్నయుం ద్రిలోకసంచారియునగు నారదునియట్టి విజ్ఞాననిధివలనం దన యెఱింగినయర్థమును దృఢీకరింపంజేసికొనుట యవసరముకదా! సూర్యచంద్రు లుండునంత కాలము గంగాస్రవంతివలె నిరతిశయపవిత్ర మగు మహాకావ్యమును రచింప నుపక్రమించిన పరమతపోవర్యునిమానస మట్లు తహతహం జెందుట సహజము. భర్తృహరి చెప్పినట్లు తెలియనివానికే సర్వము తెలిసిన ట్లుండును. ధర్మరాజుగారి కన్నియు సందేహములే! తిప్పన్నామాత్యున కెట్టి సందియ ముండదు. కావునం దనకు క్షుణ్ణముగం దెలిసిన విషయమునుగూడ మహత్తరానుభవము గలిగినపెద్దలు వచ్చిన ప్పుడు వారినుండికూడ "సెహబాస్" అని యనిపించుకొనుట మన యార్యసాంప్రదాయ మని మనకు శ్రీమద్రామాయణము బోధించు చున్నది. ప్రకృతనవ్యాంధ్రవాఙ్మయవిశ్వబ్రహ్మల రచనగమనికలం గాంచినచో వానికి దారితెన్నులు తోంపక పాఠకులలో విశేషముగం

బ్రికృతమున స్త్రీలే యగుటచే నా కథావస్తువులచే నలంకరింపఁబ
కాగితములను మఱుచటిదిన ముదయముననే తమ బిడ్డలనపర్యల
మాత్రి ముపయోగింపఁబడుట తటస్థించుచున్నది! అంతకన్న నా ర
భాసాలంకారపూరితము లగు కథాసృష్టికర్తల గ్రంథ రాజముల కిరవ
స్థాన మేమి కలదు!

శ్లో. "యత్ర భార్యా గిరో వేదాః యత్ర ధర్మోఽర్థసాధనం
యత్ర స్వప్రతిభామానం తస్మై శ్రీకలయే నమః

కవిడంబనము

అని వక్కాణించెను. కలివిడంబనకారుఁడు. ఈ నాఁడాతనివాక్యమ
లెంత యన్వర్థములో మనము చూచుచున్నాము. నేఁటిరచయిత
స్వప్రతిభావిలసితము లగు రచనలు కేవల మర్థసాధనాపేక్షయం
పర్యవసించుచున్నవి! కాని వాల్మీకి యట్టి దుష్టకామముతోఁ దన
వ్యమును రచింపఁదలంపలేదు. తాను రచించెడికావ్యమునకుఁ బరమ
ర్థము, గంగానదివంటిపవిత్రయోజనమువంటి దనుట నిస్సంశయము. అంద
చేతనే యా ఋషిపుంగవున కెన్ని చూచినను, నెంత యాలోచిం
నను, తన కనులయెదుట బ్రహ్మవరమహిమచే నంతయుఁ గరతలామ
కముగఁ గాన్పించుచుండినను నాతఁడు నారదుని బ్రశ్నింపనక్కట్లైను
నారదుఁడుమాత్రము తక్కువవాఁడా? వాల్మీకి పదియాఱుగుణము
గల మహాపురుషునిగూర్చి యుపన్యసింపుఁ డని యా స్వాధ్యాయ
రతుఁ డగు తపస్విని గోరినంతనే యా దివ్యమునిపుంగవునిమాన
ముప్పొంగ నతఁడు చతుష్షష్టికళాత్మకమును బరమపవిత్రము నగు వే
మువలె జతుష్షష్టి నిరతిశయగుణాత్మకుఁడగు శ్రీరామచంద్రునిగూ
మహాగంభీరమై సూక్ష్మతరశబ్దనైఖరీసమేతమై యల్పాక్షరసమన్వి
శబ్దములచే నధికార్థస్ఫోరకము లగు తన విశిష్టవాగ్విలాసముతో

కౌసల్యానందవర్ధనుని వర్ణించి చెప్పెను! ఆహా! ఉపదేష్ట యనఁగ నట్లుండవలెనుగదా! మన పాఠశాలలయందు బోధించు పండితు లా నారదుని జూచి తమ యుపదేష్టృత్వమును సంస్కరింపఁగడంగుచో నేఁటి భారతవర్షమునందలి బాలబాలికల విద్యాసంస్కారములు మిగుల నభివృద్ధి గాంచఁగలవు. నా మిత్రులలో నొకరు "శర్మగారూ! మీరు వ్రాస్తారు గాని మీకు మూఁడవ హస్తం కొంచెం పొడుగండీ" అనఁగా చాదస్తముగా వ్రాస్తారండీ" అని విమర్శించుచుండిరి. వారికి నారదుఁ డే తీరున వాల్మీకి కుపదేశించెనో జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాను. నేను పండితులకొఱకు విద్యాధికులకొఱకు నీ రామాయణవిమర్శన మందీయఁదలంపలేదు. అక్షరాస్యు లగు జనసామాన్య మీ విషయమును గ్రహింపవలె నను నూహాలోడనే నేను రచింపమొదలిడితి ననిగూడ వారికి నా మనవి. వాల్మీకియట్టిమహర్షి గూడఁ దన నాయకునిగూర్చి నారదునియట్టిప్రతిభావంతుఁ డేమి సెప్పునో యని యుబలాటపడియుండ నాబోఁటి యల్పవిద్యావంతుఁడు నేను జెప్పువిషయము ప్రజాహృదయమున కర్థ మగునో లేదో యని తహతహ చెందుట సహజముకదా! ఇఁక నా పరాపశ్యంతీ మధ్యమా వైఖరీ వాక్సంప్రదాయములను బూర్తిగ నెఱింగిన నారదుఁడు స్వతస్సిద్ధముగ మహత్తరగాయకుఁడును నాట్యశాస్త్రవిశారదుఁడు గూడ నగుటచేఁ దన యప్రతిహతవాగ్విలాసముచే నత్యంతమృదుమధుర వచనరచనచేఁ బృచ్ఛకుఁ డగు వాల్మీకిహృదయకుముదముఁ సహస్రముఖంబుల రంజిల్లునట్లుగ శ్రీరామయశశ్చంద్రికలను గీర్తించెను. తా నూహించి రచింపఁదలంచిన చరితమునకుఁ బ్రధాననాయకునకుఁ బదియాఱు గుణంబులున్నవా? యను ప్రశ్నకు గురు వా నాయకున కఱువదినాల్గు గుణంబులు కల వని యెఱిఁగించినచో నా శిష్యుని యానందమునకు మేర యుండునా? ఇఁక వాల్మీకిరచనావైభవమున కమృతరసప్రవాహమును బ్రసరింపఁజేయు నీటు సరస్వతియు నటు బ్రహ్మయుఁ బూనుకొనిరి! అతని చేతిది ఘంటమా! అతఁడు రచించినవి తాఁటియాకులా? కావు! కావు! అతనిచేతిలోని దొక యమృతరసప్రపూరితస్వర్ణమయ మోహనలేఖని!

ఆతఁడు రచించినింపినవి నిరంతరభావతరంగితములై నిరవధికమధుర
ప్రవాహాపోషితము లగు మానసమానసకాసారములు! ఆ కవి ర
వాఁడో వానిపరికరము లట్టివి! వానిపరికరము లెట్టివో యూతని
నట్టిది! ఆతనివస్తు వెట్టిదో యందలి పాత్రలుగూడ నమృతమయము
ఇఁక వేద మా మహాకవిలేఖినినుండి మహాకావ్యపథంబునం బడి
త్రేతాయుగాంతము మొదలు కలియుగాంతముఁజుకును వేయేల య
యుగాంతములవఱకు నాకేతీరునం బ్రవహింపకతప్పునా? శ్రీరా
చంద్రు లనేకులుండ వచ్చునేమోగాని వాల్మీకి యొకఁడే! యూనఁ
తీయుఁడు. ఆతఁడు రచించిన బాటపై నడుచుకొనుల కనేక రాము
డిన నుండవచ్చు. రాముఁ డవతరించినప్పుడెల్ల సీత యవతరింపకతప్ప
అందుచేతనే శ్రీరామచంద్రుఁడు "దేశేదేశే కళత్రాణి" యని
యొక్క తెయే మహాపతివ్రత యని యంగీకరింపలేదు! ఎన్ని శ
ములు భూతభవిష్యద్వర్తమానప్రభునామకు లీ భారతసంఘమున
జొప్పింపఁదలంచినను వాల్మీకి రచించిన సీతారాముల చరిత్ర మాత్ర
హిమవత్పర్వతశ్రేణివలె నిలచి యచంచలమై యుండకమానదు. భ
జాతియొక్క ప్రతిస్త్రీపురుషుని నాడులయందుఁ బ్రవహించెడి జీవ
కణంబులు శ్రీమద్రామాయణకథాశబ్దసంస్కృతంబులు! ఒకవేళ న
మాఱినను వానరులో! వానరుల నితరదేశముల కెగుమతిసేసినను,
మయపర్వతపంక్తు లున్నవి! మైనాకుఁ డింకను సముద్రమున
డాఁగి శ్రీరామచరిత్ర నుద్ఘోషించుచునేయున్నాఁడు! ఒకవేళ నాప్ర
కాలంబున శిలామయపర్వతపంక్తులుగూడ చూర్ణితములైనను
బంధముచేఁ బవిత్రముగ నింపఁబడిన జలార్ణవ మేమగును? క
ననాది యగు నీ సముద్రము గూడ రామువృత్తాంతమును మా
కంఠింపకమానదు. అయ్యది తంత్రీలయసమన్వితమై భూమా
ములు నిండిన శతకోటిప్రవిస్తరగాథ! అట్టి శ్రీమద్రామాయణము
ప్రధానపాత్ర యగు శ్రీరామచంద్రునిగూర్చి యథాశక్తిగ మ
సంచికనుండియుఁ బాఠకమహాశయుల కందింప యత్నింతును.

# కవిసార్వభౌముని కథాకథన కౌశలము.

శ్రీ కాకర్ల వెంకటరామనరిసింహము.

కాశీఖండమునందలి యుపాఖ్యానములలోఁ గళావత్యుపాఖ్యానమున కొక ప్రత్యేకత గలదు. అది కథావిధానమునకు సంబంధించి యున్నది. కవిసార్వభౌముని యాంధ్రీకరణమున, మూలమునకు వన్నె పెట్టు ఘట్టము లనేకములు గలవు. కాని యవి యన్నియు నౌచిత్యనిర్వాహణముకొఱకు శిల్పదృష్టితోఁ గావింపఁబడినవి. కళావత్యుపాఖ్యానము నందుఁగూడ నట్టి మెఱుఁగులు పెక్కులు గలవు. వానికిఁదోడు కథా గతియందును మార్పు గావింపఁబడినది. కథాగతియందు మార్పుసేయుట శ్రీనాథునిపద్ధతి గాదు. అట్టియెడ నీ యుపాఖ్యానమునమాత్రమ మ్మహాకవి యట్టి ప్రత్యేకత నేల చూపె నను విషయము చర్చనీయము. ప్రప్రథమముగ నా మార్పెట్టిదో చూచి, తరువాత నద్దాని నేల చేసెనో గమనింతము. మూలమున సుశీల సహగమనము చేసినట్లు లేదు.

"ధ్యాయంతీ సాపి తం బాలా, విద్యాధర కుమారకమ్
విరహాగ్నా విసృష్టాసుః, కర్ణాటే జన్మభాగభూత్."

మీఁది వాక్యములనుబట్టి సుశీల యుత్కట మగు విరహబాధను సహింపఁజాలక మరణించె నని చెప్పనగును. ఆంధ్రమునమాత్ర మామె సహగమనము చేసినట్లు గలదు. చూడుఁడు

"అనుచు హరిణాంకమూర్తి తీవ్రాంశుఁ బోలె,
కొనర కగ్నిఁ బ్రవేశించెఁ గువలయాక్షి".
"ఆలింగనంబు సేసెం
బాలిండ్లను ముట్టె వదనపద్మము తాఁపుక్
గ్రోలె మగఁ డనఁగ నెవ్వం
డా లనఁగా నెద్ది! భర్త యతఁడే నాలిక్."

"అని విద్యాధరునితోఁడ ననుగమనంబు సేయఁదలంచి, యం
యమ్మొఱుంగుఁబోఁడి మలయాచలోపాంతంబున"

"వెగ్గల మైన కూర్మి నరవిందదళాయతనేత్ర కొండకా
రగ్గి పటీరకాష్ఠములయందు రవుల్కొనఁజేసి కమ్మపూ
మొగ్గలదండ దాల్చి మది మున్కడఁ గాశిని విశ్వనాయకు
న్దిగ్గన సంస్మరించి, జననిం జనకుం దలఁచెం గ్రమంబునన్."

"నెండియు న క్కన్యక కర్పూరకదళికాద్రుమనిర్యన్నిర్యాసధారా
వాసనానుగంధంబు లగు గంధసారగిరినితంబనిర్ఝరాంభః ప్రవాహం
ముఖప్రక్షాళనం బాచరించి, విద్యాధరోపరివిరచిత (చితా) గంధ
కాష్ఠంబుల రవుల్కొని గంధకరటికర్ణతాళవృంతతాండవ ప్ర
విస్తారితంబు లగు మారుతంబులవలనం బెచ్చుపెరిఁగి విచ్చలవి
మండుచిచ్చునకుం బ్రదక్షిణంబు వచ్చి నిసర్గకాతరంబులగు కటాక్ష
ణంబులు పుష్పాంజలివిక్షేపంబులభంగి నంగీకరింప"

పైఁదివర్ణనమునుబట్టి సుశీల సహగమనము సేసె నను
యము నిశ్చిత మగుచున్నది. ఇఁక కవిఁ యీ మార్పేల చేసె
నంశము చర్చనీయము. ఈ మార్పునకుఁ గారణములు ముఖ్యమ
రెండు గన్పట్టుచున్నవి.

1. గ్రంథప్రభావము. 2. కాలప్రభావము.

1. కాశీఖండమున, ద్వితీయాశ్వాసమున, బృహస్పతి లోపా
ద్రికిఁ బతివ్రతాధర్మములఁ జెప్పు ఘట్టము కలదు. అందు, సహ
నము, పతివ్రతా ధర్మములలో నత్యుత్తమముగాఁ జెప్పఁబడి
చూడుఁడు:—

"పిఱికికండ యొకింత లే కటమి వేడ్కఁ
జిచ్చులకఁబోవు వికచరాజీవనేత్రి
కశ్వమేధంబు ఫలము తథ్యంబు గలుగుఁ
బదపదమ్మున కిదె వేదభాషితమ్ము."

పుట్టలోపల పాము నభ్యుద్ధరించు
వశ్యమంత్రుండు పాములవాఁడపోలె
భర్త నభ్యుద్ధరించుఁ బాపంబువలన
నగ్ని నుఱికినయట్టి పద్మాయతాక్షి.

"తొలఁగుదు రంతనంత యమదూతకిరాతులు భీతచిత్తులై
కలుషసమన్వితుం డయిన కాంతుని దారుణలోహపాశ శృం
ఖలికలు విచ్చి పుచ్చుకొని కాంతచితాగ్నిశిఖాముఖంబునన్
వెలువడి యాత్మభర్తవెనువెంబ హుటాహుటి గూడివచ్చినన్.

ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించుసాధ్వి
నాకభువనంబునం దాత్మనాథుఁ గూడి
వెఱపొకింతయు లేక చిచ్చుఱికెనేని"

ఇట్టి పతివ్రతాధర్మములు గల గ్రంథము కాశీఖండము. ఆ గ్రం
థమున నే, కళావత్యుపాఖ్యానము గలదు. ఆ యుపాఖ్యానమున నే, యొక
సాధ్వీభర్త మరణించినట్లు చెప్పఁబడియున్నది. భర్తృమరణానంతర మా
యుమకర్తవ్య మేమి? కాశీఖండమున నా యంశము విస్పష్టముగాఁ
జెప్పఁబడియేయున్నది. సహగమనము సేయుటయే యా సాధ్వీకర్త
వ్యము. సహగమనము సేయకున్న నామె పతివ్రత కాకూడదా?
కావచ్చు. కాని యుత్తమసాధ్వీలక్షణ మది కాదు. మఱియు వితం
తుత బహుధా గర్హింపఁబడినది. అవ్విషయమున నుదాహరణము లిట
నప్రస్తుతము. ఇంక నే గ్రంథమున వితంతుజీవనము బహుధా గర్హింపఁ
బడి, సహగమన ముత్తమోత్తమసాధ్వీలక్షణముగాఁ బ్రస్తుతింపఁబడి
నదో, ఆ గ్రంథమున నే, సుశీల యను సాధ్వి, భర్తృమరణానంతరముగూడ
జీవించియున్న దని చెప్పుట హాస్యాస్పద మగుటయే కాక, గ్రంథప్రతిపా
దితధర్మమున కుపహతియు నగుచున్నదిగదా! కవిసార్వభౌముఁడు

మూలమునందలి యీ లోపమును గ్రహించినాఁడు; సుశీలచే సహగ
నము చేయించినాఁడు. ఇంకొక ముఖ్యవిషయము— భంగ్యంతరమ
గూడ సహగమనమే సమర్థనీయ మగుచున్నది. మలయాద్రి కాశీక్షే
మునకుఁ జాల దవ్వునఁ గలదు. ఖేచరగమనము గలవాఁడు కా
విద్యాధరుఁ డవలీల నంతదవ్వుఁ దరించినాఁడు. సుశీల మానవి; ఆమె
ఖేచరగమనము లేదు. ఒంటరిగా నంతదూరము నడచిపోవుటయు న
ధ్యమే. ఒకవేళఁ బోయినను మార్గమధ్యమున నెట్టి యిక్కట్లు
వచ్చునో! ఆమె సుందరి; ఆమె యపరూపసౌందర్యమునకు ము
డై యేకదా విద్యాధరుఁ డామెను మలయాద్రికిఁ దెచ్చినది! ఇఁక నా
యొంటరిగా నేఁగుచో నెవ్వ రెట్లగుదురో యెవ్వరి కెఱుక? కావు
గాశి కేఁగుట యసంభవము. ఇఁక మలయాద్రియందే యుండరా
యన్న నది మఱియుఁ గష్టసాధ్యము. అసంభావ్యము. సుశీల కాశీ
పురియందుఁ బుట్టి పెరిఁగినది. అచ్చోటు వాసి యెన్నఁడు నెచ్చో
నేఁగినది కాదు. మఱియుఁ దలిదండ్రులచాటునఁ బెరిఁగినది. అ
య్యామె కన్నుమూసి తెఱచునంతలో మలయకూటమున కేఁగిన
దారితెన్ను లామె కేమియుఁ దెలియవు. అట్టియెడ నమ్మహారణ్యమ
నా ముగ్ధ యె ట్లుండఁగలదు? ఏమి చేయఁగలదు? అనన్యసామా
మగు నామె సౌందర్యమునకు ముగ్ధులై యాటవికు లెవ్వరైన నామె
కేటు గల్పింపవచ్చును. కావున, నాపరిస్థితిలో నామెకు సహగమ
మొక్కటియే శరణ్యము. కావుననే కవిరాజు చేసిన యీ మార్పా
యుచితజ్ఞతను వేనోళ్ళఁ జాటుచున్నది.

2. కాలప్రభావము:—ఇది మొదటిదానికంటె బలీయ మైన
కాకతీయసామ్రాజ్యము క్రీ॥ శ 1323 లో, మహమ్మదీయులవశ మైన
వశమైనంతనే తురకలయత్యాచారములు మిన్నుముట్టినవి. గోబ్రాహ్మ
ణుల హింసించియుఁ బతివ్రతలఁ జెఱబట్టియు, దేవతాయతనము

గొల్లకొట్టియు, హైందవమతగ్రంథములఁ దగులఁబెట్టియు, వారు విచ్చల విడి సంచరింపఁజొచ్చిరి. వారియత్యాచారము లెంతకాలమో సాగ లేదు. మునునూరిప్రోలయనాయకుని యాధిపత్యమున నాంధ్రమహావీరు లందఱు నేకమై మహమ్మదీయుల నిర్జించి యాంధ్రసామ్రాజ్యమును స్థాపించిరి. ప్రోలయకుఁ జేదోడువాదోడుగఁ గాపయనాయకుఁడు పని చేసెను. కాని యేమి లాభము? కొలఁదికాలములోనే యాంధ్రులలో నైకమత్యము చెడిపోయినది. రాచకొండవెలమలకును, రెడ్లకును మనః స్పర్థ లేర్పడినవి. విజయనగరసామ్రాజ్యము స్థాపింపఁబడినది. కాని దానికిఁ బ్రత్యర్థిగా బాహమనీసామ్రాజ్యమును మహమ్మదీయులు స్థాపిం చిరి. ఈ సామ్రాజ్యస్థాపనకుఁ గాపయనాయకుని యవివేకమే కొంత కారణ మనవచ్చును. మహమ్మద్బీన్‌తొగ్లక్ తెలంగాణముపై నెపుడు దాడివెడలునో యను భయము. కాపయనాయకుఁడు జాఫరుఖా నను నొక తురకకు సాహాయ్యము గావించెను. వాఁడు కాలూనినంతనే, స్వతంత్రుఁడై బాహమనీసామ్రాజ్యమును స్థాపించి, ప్రప్రథమముగాఁ దనకు సాహాయ్యము గావించిన కాపయపైకే దాడివెడలి, యాతని నోడించి, కొన్ని దుర్గములుకూడ నాక్రమించెను. ఈ జాఫరుఖానుఁడే సింహాసనము నధిరోహించినతరువాత, 'అలాఉద్దీన్‌హసన్‌గంగూబహ మన్' అను బిరుదునామమును దాల్చెను. ఢిల్లీసుల్తానుమరణానంతర మాతఁడు మఱలఁ దెలంగాణముపై దాడివెడలెను. ఇతని మరణానంతర మాతని తనయుఁడు మహమ్మద్‌షా యనువాఁడు క్రీ॥ శ 1366 లో మఱలఁ దెలంగాణముపై దాడివెడలెను.

ఇట్లు మహమ్మదీయులు విజృంభించుచుండఁగా నాంధ్రవీరు లేమి చేయుచుండిరి? నిద్రించుచుండిరా యను సంశయమునకు నవకాశము లేదు. విద్యానగరప్రభువులు బహమనీసుల్తానులతో వెనుకంజ వేయక యుద్ధము చేయుచునే యుండిరి. రెడ్లును వెలమలును నప్పుడప్పు డా

యుద్ధములలోఁ బాల్గొనుచుండిరి. కాని తురకలలోఁ గల నైకమ
మాంధ్రప్రభువులలో లేకుండుటచే వారిని సమూలముగా నిర్జించ
వీఁకి సాధ్యపడ దయ్యెను. మహమ్మదీయుల దౌర్జన్యముల కాం
లప్పుడప్పుడు గురి యగుచుండిరి. అట్టియెడ స్వజనస్వధర్మరక్షణార్థ
ధర్మజ్ఞులగు వారికి, విపరీతములగు కొన్ని కట్టుబాట్లను బ్రచార
లోనికిఁ దెచ్చుట తప్పనిసరి యైనది. అట్టి విపరీతనియమ
లలో నొకటి సహగమనము. దీనిని బ్రచారము లోనికిఁ దెచ్చుట
కవులును బండితులును బహుధా శ్రమించిరి. గ్రంథములలో సమయ
వచ్చినప్పు డెల్ల సహగమనము నత్యుత్కృష్టపతివ్రతాధర్మముగాఁ బ్ర
సించిరి. ఆర్యద్రావిడ సంఘర్షణావసరమున నార్యులు స్వజనశీలరక్ష
ర్థమై యేర్పఱచుకొనిన యీ దుష్కరమృష్కర సంప్రదాయమ
దురకల దౌర్జన్యమునకు వెఱచిన యాంధ్రులు పునరుద్ధరించిరి. క
ప్రభావమునుబట్టి శ్రీనాథమహాకవియు నీ నియమము నంగీకరింపక
నదికాదు. కళావత్యుపాఖ్యానమునందలి మార్పున కిదియు నొక
ణము గావచ్చును. శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు History
the Reddi kingdoms అను దన గ్రంథమున రెడ్డిరాజులకాలమ
సహగమనము ప్రచారములో నున్న సంప్రదాయమే యని యీక్రి
వాక్యములలోఁ జెప్పియున్నారు.

"Sahagamana or Sati was another custom. Some of t
Telugu works, like Rukmangadacharitra and Kasikhanda
which were produced in this period, describe the custom
Sahagamana or following one's husband to the other world,
immolating oneself on his funeral pyre. The letter work sta
that she who jumps into fire gladly without any fear or tin
dity, acquires as much phala as one would get by the perfo
mance of an asvamedhayaga, that is, the horse sacrifice. T
exuberant praise, lavished on this custom in the Telugu wor
referred to above, and the enumeration of different kinds
merit, which a married woman would reaply performing th

rite, suggest that there was a conscious effort to popularise this custom. It seems probable that the Mustim invasions were, to some extent, indirectly responsible in inducing the leaders of the Hindu society mobilise opinion to enforce this custom, if it was already in vogue. The atmosphere, which was surcharged with the spirit of self-sacrifice, and the social and political conditions then prevailing, added strength to this custom.

"There is no denying the fact that this custom was in vogue in the period under review. "When any man dies" observes. Frair odoric, "they burn him, and if he leaves a wife they burn her alive with him, saying that she ought to go and keep her husband company in the other world. But if the woman have sons by her husband she may abide with them, as she will. And, on the other hand, if the wife die there is no law to impose the like on him; but he, if he likes, can take another wife." Friar Jordanus writes: "In this India, on the death of a noble, or of any people of substance, their bodies are burned, and eke their wives follow them alive to the fire, and, for the sake of wordly glony, and for the love of their husbands, and for eternal life, burn alorg with them, with as much joy as if they were going to be wedded; and those who do this have the higher repute for virtue and perfection among the rest. Wonderful! I have sometimes seen, for one dead man who was burnt, five living women take their places on the fire with him, and die with their dead." One who committed Sati was revered as perantalu or matrasati and occasionally her image was made in stone and worshipped."

శ్రీ సోమశేఖరశర్మగారు తమ యభిప్రాయముతో పాటు మరి కొందఱి యభిప్రాయములనుగూడ జోడించి చెప్పి రెడ్ల రాజ్యకాలమున సహగమన మాచరణములో నున్నదని నిరూపించుటయే కాక శ్రీనాథాదులు తమగ్రంథములలో సతి నంతగాఁ బ్రశంసించుటకుఁ గారణము తత్కాలప్రభావమే యనియు సువ్యక్తము చేసియున్నారు. కావున గ్రంథప్రతిపాదితధర్మప్రభావమును గాలప్రభావమును గారణములుగాఁ గళావత్యుపాఖ్యానమునఁ గవిసార్వభౌముఁ డీమార్పును గావించె నని మనము నిశ్చయింపనగును.

మీఁదఁ జెప్పినది ముఖ్య మగు మార్పు. ఇంకఁ గథాదృష్టిత
శ్రీనాథుఁడు గావించిన మార్పు లనేకములు గలవు. అవి యతని
యౌచిత్యపరిజ్ఞానమును, సరసకవితాకళావైదగ్ధ్యమును, పాత్రచిత్ర
చాతుర్యమును వ్యక్తము సేయుచున్నవి. వానిని వరుసగాఁ బరిశీలి
తము. మూలమున సుశీలా [మఱుజన్మమునఁ గళావతి] సౌందర్యము
గూర్చి పెక్కుశ్లోకములు పరిబంధ ధోరణిలోఁ జెప్పఁబడియున్న
ఆమె సౌందర్యవర్ణనము నిట నావశ్యకమే. కాని మూలమునందువ
నఖశిఖాపర్యంతము వర్ణించుట యనావశ్యక మగుటయే కాక ప్రకరణ
ర్దిష్ట పవిత్రాశయ విధ్వంసమునకును గారణ మగును. ఇచ్చట నీ యు
ఖ్యానము శివతీర్థ (జ్ఞానవాపిక) మాహాత్మ్యప్రకటనార్థము చెప్పఁబ
నది. ఇందలి ప్రతివాక్యమును బ్రత్యక్షముగనో పరోక్షముగనో తన
హాత్మ్య విశదీకరణమున కుపకరించునదియై యుండవలెను. వర్ణన
గూడఁ బ్రస్తుతాంశ ప్రతిపాదకములై సహజములై యుండవలయును
అట్లు కానినాఁ డవ్వి యనౌచితములే యగును. మూలమునంద
సుశీలావర్ణనము సుదీర్ఘమై ప్రకరణౌచిత్యమును గోల్పోవుచున్న
చూడుఁడు :—

> కలాకలాపకుశలా స్వరేణ జితకోకిలా
> న నారీదాదృగస్తీహ, నామరీ కిన్నరీ న చ
> విద్యాధరీ న నో నాగీ గంధర్వీ నాసురీ న చ
> సర్వసౌందర్య నిలయా సర్వలక్షణసత్ఖనిః
> అధిశేతే ధ్రువం ధ్వాంతం తస్మాలిం బ్రధ్న సాధ్వసాత్
> తదాస్యం శరణం యాతో మన్యే దర్శభయాచ్ఛశీ
> దివాపి న త్యజేత్తాం తు త్రస్తశ్చండమరీచితః
> తద్భ్రూభ్రమరరాజీవగండపత్రలతాంతరే
> ఉదంచత్కాంచ దుడ్డీనగతే రభ్యాస భాజినీ

త చ్చారులోచన క్షేత్రే విచరంతౌ చ ఖంజనౌ
సదైవ శారదీం ప్రీతిం నిర్విశేతే నిశేచ్ఛయా
సుదత్యా రదనశ్రేణీచ్ఛే దేషు విషమేషుణా
విహితా కాంచనీ రేఖా క్వేందావేతావతీ కలా
ప్రాయో మదన భూపాల హర్మ్యరత్నాంతరే శుభే
జిత ప్రవాల సచ్ఛాయే తస్యారదన వాససీ
స్వర్గే మర్త్యేచ పాతాలే నైషా రేఖా క్వచిత్ స్త్రియామ్
తత్కంఠరేఖా త్రితయ వ్యాజేన శపతే స్మరః
శంకే చిత్తభువో రాజ్ఞో లసత్పటకుటీద్వయమ్
అనంగ భూనియమతో ఽదృశ్యే మధ్యే న తద్భ్రువః
రోమాలీలక్షితా మూర్ధ్వామివ యష్టిం విధి ర్వ్యధాత్
తస్యానాభీదరీం ప్రాప్య కందర్పో ఽనంగతాం గతః
పునః ప్రాప్తు మివాంగాని తప్యతే పరమం తపః
గురుణైతన్ని తంబేన మహామన్మథదీక్షయా
భువి కే కే యువానో న స్వాధీనాః ప్రాపితాదృశామ్
ఊరుస్తంభేన చైతస్యాః స్తంభవత్కస్య నో మనః

ఈవర్ణన మింకను గలదు. గ్రంథవిస్తరభీతిచే నింతదనుక మాత్రమే యుదాహరించినాఁడను. మూలమునందలి సాంగోపాంగ మగు నీవర్ణనము శ్రీనాథమహాకవికి రుచింపలేదు. ఆమెసౌందర్య మవశ్యము వర్ణనీయ మని కవిరాజుగూడ నంగీకరించును. ఆమె సౌందర్యమే యామె యిక్కట్టులకుఁ గారణ మయినది. ఆ సౌందర్యమునకు ముగ్ధుఁడై యే విద్యాధరుఁ డామెను గామించి తుద కామెకొఱకై ప్రాణములనుగూడ బలి యిచ్చెను. కావున శ్రీనాథమహాకవియు నామె సౌందర్యమును ప్రకర ణోచితముగ వర్ణించి తన యౌచితీపరిజ్ఞానమును వ్యక్తము సేసియు న్నాఁడు. చూడుఁడు— మొట్టమొదట "సుశీల యనునది రూపరేఖా

విలాసంబులం ద్రిభువనంబుల యందునుం బొగడఁదగియుండు''నని
యనంతరము పౌరు లామె సౌందర్యమును జూచి యువ్విళు
చుందు రని చెప్పినాఁడు.

"లలన సాక్షాత్కరించిన లక్ష్మివోలెఁ
గంకణములతో మణినూడిగముల రాయ
విశ్వనాథుని కళ్యాణవేది యందు
ముగ్గు పెట్టంగ మోహించు ముజ్జగంబు
బహుళసౌభాగ్యలక్ష్మికిఁ బద్మముఖికి
ముజ్జగంబుల సరి లేరు ముదిత లనుచు
బ్రహ్మసంకేతరేఖలు వ్రాసె ననఁగఁ
గాంతగళమున నొప్పె రేఖాత్రయంబు."

సాధారణముగాఁ గవులు సౌందర్యవర్ణనమును రెండువిధములఁ
సురు. ఒకటి, ఏయంగమున కాయంగమునే వర్ణించుట; రెండు,
దాయికముగా సర్వాంగసౌందర్యమును స్ఫురింపఁజేయు పదస
యము నుపయోగించి వర్ణించుట. ఇందు మొదటిదానికంటె రెం
రసవత్తరము. సౌందర్య మనునది యాత్మాశ్రయమా పరాశ్రయ
యను సమస్యకు మన తత్త్వశాస్త్రజ్ఞు లిప్పటికిని సరియగు సమా
మిచ్చినట్లు గన్పట్టదు. కాని వారందఱు నొక్క విషయము నే
ముగ నంగీకరింతురు. అది యంగాంగీభావసంకలమునందే సౌంద
గల దను సిద్ధాంతము. సౌందర్య పరిగణమునఁ బృథగ్భావనకుఁ
లే దనువాదము సమంజసము కాదు. అట్లని పృథగ్భావనయందే
దర్యము నిక్షిప్త మయియుండు ననుటయు నమంజసము కాదు.
గమున కాయంగమునే భావించుట పృథగ్భావన యనఁబడును.
వన యనఁగా నేయంగమున కాయంగమునే భావించుట యట్లే
యున్నచో ననఁగాఁ గవి కల్పనా ప్రభావ మంతవఱకే భావుక

యమును గొనిపోవ సమర్థమై యున్నచో, నయ్యది నిజమగు సౌందర్య వర్ణనము కాదు. అంగసౌందర్యవర్ణన మంగిసౌందర్య ద్యోతక మయి యుండవలయును. అంగిసౌందర్యవర్ణన మంగసౌందర్యము నుద్దీపింపఁ జేయవలయును. మఱియు స్థూలరూపవర్ణనముకంటెఁ దత్గతలావణ్య వర్ణనము రసవత్తరము. కవి సార్వభౌముఁడు సుశీలాసౌందర్య వర్ణనమున నీయంశముల నన్నిటిని బ్రతిపాదించి చూపినాఁడు. అమ్మహాకవికి సుశీల సాక్షాత్కరించిన లక్ష్మివోలెఁ గన్పట్టినది. ఎప్పుడు? విశ్వనాథుని కళ్యాణవేదియందు ముగ్గులు వెట్టునప్పుడు. జగదీశ్వరుఁ డగు ఈశ్వరుని కళ్యాణవేది సకలకళ్యాణసంధాత్రి యగు నాదిలక్ష్మి ముగ్గులు వెట్టిన నెట్లుండును? అది యనిర్వచనీయ మగు నొక సన్నివేశము. ఆ సన్నివేశమును భావించి ప్రత్యక్షీకరించుకొనినాఁడు మహాకవి. ఆసాక్షాత్కారమే సుశీలాపాత్రచిత్రణమునందు మనకును సాక్షాత్కరించుచున్నది. ఆమె తెలికన్నులు, మొలకచన్నులు, బొమ్మలమీఁద వ్రాలు గుంతలములు మాత్రమే యిట వర్ణితము లయియున్నవి. మొలక చన్నులు చెప్పుట యౌవన ప్రాదుర్భావసూచనార్థము తెలికన్నులు నిష్కళంకత్వమును సూచించును. బొమ్మలమీఁద వ్రాలు కుంతలములు సౌభాగ్యసంసూచకములు. గళమున రేఖాత్రయము సర్వసంపత్సూచకము. ఇట్లామె సౌందర్యము కొలఁది మాటలలోనే స్ఫురింపఁజేసి కవి, యామెరూపచిత్రమును భావుకమనఃఫలకములయందు రూపరేఖలు చెడకుండ చిత్రించినాఁడు.

---

# మేఘదూతము.

(అనువాదము)

శ్రీ బొడ్డుపాటి వెంకట సుబ్బారావు, ఎం. ఏ.

ఈ ప్రపంచమున మేఘు నెవ్వ రెఱుఁగరు? నిర్జనారణ్యము
దనగూటిలో నొంటిరై నివసించు పక్షిశాబకము మొదలుకొని కి
రానుచరులైన గుహ్యకసిద్ధులవఱకు నెల్లరును మేఘుని గని యా
తురు; సమ్మానింతురు. స్థూల సూక్ష్మ, దృశ్య, సేంద్రియ నిరింద్రి
భేదములు లేక సకలపదార్థములు మేఘాగమనముచే ప్రభావా
తము లగును. కవి యాతని [1]సాధు[2], సౌమ్య, [3]సుభగ [4]ఆయుష్మ
బ్దములచే సంబోధించినాఁడు.

మేఘుని యాశీర్వాద మెల్లరకు సమానమే. అతనిప్రసాద
దఱకు లభ్యమే! అతఁడు కూర్చుట వితరణకొఱకే. ప్రజాపాలన
చేతనే మేఘుఁడు 'ప్రజాపతి' యైనాఁడు. అతనియజ్ఞద్వార మెల్లర
దెఱచియే యుండును. అతని సర్వస్వవితరణముచే నెల్లరుపుష్టి చెందెద
వర్షర్తువున నీలాభిరామ విష్ణురూపమేఘుఁ డెంత సౌభాగ్య సమన్వి
డగునో లోకలక్ష్మియు నంత యధిక సంపన్నయగును.

మేఘుని యాయువు సృష్టికల్పమువలె సనాతనము. ప
యుద్భవస్థితిసంహారముల మూఁడింట నతనికిఁ బాలు కలదు. మే
డమరబ్రహ్మచారి[5]. అందుచేఁ బురాణపురుషుఁ డయ్యును నిత్యయ
నుఁడు. ప్రతిసంవత్సరము నతఁడు కాయకల్పము చేసికొనును. ఇ

---

1. ఏభిః సాధో హృదయనిహితైర్లక్షణైః లక్షయేథాః మే. దూ 2-17.
2. 'శ్రోతవ్యస్మాత్పర మకహితాన్ సౌమ్యసీమంతినీనాం మే. దూ 2-37.
3. 'సౌభాగ్యం తే సుభగ విరహావస్థయా వ్యంజయంతీ' మే. దూ. 1-39
4. 'తామాయుష్మన్ మమ చ వచనాదాత్మనశ్చోపకర్తుం' మే. దూ. 2-38
5. ఉదకమునకు బ్రహ్మచారి పేరు (నిఘంటువు 1-12)

యుష్మంతుఁడును సౌమ్య సుభగ సాధువు నయిన మేఘునిగూర్చి[6] ప్రీతి ప్రముఖ వచనములచే యక్షుఁడు చేసిన ప్రశంస యెంతేయుఁ దగియున్నది. మేఘజలములచేఁ బుష్టినంది, వనస్పతి జగత్తు, విశ్వవ్యాప్తమైన జీవశక్తిని దనలోఁ గూర్చుకొనుచున్నది. సర్వౌషధసారభూత రసము జలమే[7]. కృష్టపచ్య, అకృష్టపచ్యౌషధులే పశువులను బోషించునవి. ఈ విరాట్ప్రకృతిలో మనుష్యుఁ డొక (మంచి యాఁకలి గల యన్నము దిను) అన్నాదపశువు. అందుచే జీమూత మేఘుఁడు సర్వప్రాణులకు నాథుఁడు. సర్వత్ర జలవహనక్రియచే నతఁ డంబువాహ వారివాహ నామకుఁడైనాఁడు. జలమేహనక్రియచే (విసర్జన)నాతనికి మేఘనామము కల్గినది. తటిత్సౌదామని యాతని కళత్రము. అందుచే నాతఁడు తటిద్వంతుఁడైనాఁడు. నిత్యవ్యోమవిహారిణి యగు విద్యుత్ప్రియను సంకమం దిడుకొని అర్ధనారీశ్వరుఁ డగు శివునివలె గోచరించుచు దేశదేశములఁ గ్రుమ్మరుచుండును. వృష్టికి హేతువు విద్యుత్తుగాని మేఘుఁడు కాదు. వృష్టియజ్ఞమున విద్యుద్యజనమే చేయఁబడును. ఏలన నదియే యన్నజలాదికముల నిచ్చు సామర్థ్యము కలది.

వృష్టిర్వై యాజ్యావిద్యుదేవ హీదం వృష్టిమన్నా
ద్యం సంప్రయచ్ఛతి. ఐతరేయబ్రాహ్మణ 2-41.

ఉమా,రమా, విహీనులైన శివకేశవులనుండి యేమి శుభము నాశింపఁగలము ? మేఘునకు "ధూమయోని[9] యనికూడ పేరు. నిత్యము

. దానిని శిష్యంటి చరించు మేఘుఁడు బ్రహ్మచారి.
ఋగ్వేదమున 'ఉషకూడ - అమర్త్యపురాణీయుశతి' యని చెప్పబడినది. [ఋ 3-61].

6. 'ప్రీతిప్రముఖవచనైః స్వాగతంవ్యాజహార' [మే.పూ 1-4].

7. 'ఏషహావై సర్వాసా మోషధీనాం రసో యత్పయః[కౌషీతకబ్రాహ్మణము2-1].

8. మేఘః కస్మాత్ మేహతీతి [నిరుక్త]

9. ధూమజ్యోతిః సలిలమరుతాం సన్నిపాతః [మే. పూ 1-5]

ధూమముచే[10] "ఉపచితవపు" వగుచుండుటచే నిది గల్గినది.

వాయుపరిహారమును ధైర్యముగ సహించును; గావున మే
ఘునాధానుఁ డైనాఁడు. ఆతనియందు, జలరాశి నిండియుండుట
యతనిని, 'స్తంభితాంతర్జలౌఘు'[11] అనినాఁడు.

ఎవనిరొుద్దఁ బుష్కలమైన వృషసంచయము కలదో
గౌరవము. ముందుముందు ఘనగౌరవము మేఘుని వృషపువ
ముచే నొక పుణ్యకార్యసాధనము కవి చేయింపవలసియున్నది. ప
జలరాశిచే ననంతవృషశక్తిమయమైన మేఘసోపానములపైఁ గ
శివుఁడు మణితటారోహణము చేయును[12]. నిష్పీడితములైన మే
లందు నేమాత్రమును బ్రయోజనకారులు కావు. ఇంద్రశక్తి, శూ
లైన యింద్రియములు గల్గిన పురుషులయందు నంయమమును ద
గూడ ఫలింపవు. బలాకమిథునములు గర్భాధానోత్సవమునకై
పస్థానముచేయును. అనఁగా మేఘుని సేవించును[13]. ఇందువలన నిం
ప్రధానపురుషుల నొకనిపేరు "బలాహకుఁడు". ఇవ్విధమునఁ బ

---

10. జాలోద్గీర్ణై రుపచితవపుః కేశసంస్కారధూపైః [మే. సం 1-32].
"అగ్నిర్వైధూమోజాయతే ధూమాదభ్రమభ్రాద్వృష్టిః" [శతప
బ్రాహ్మణము 5-3-
తన కుక్షియందు గాఢమైన అభ్రమును గల్గిన మేఘుఁడే సృష్టి కుపకర్త
జలమునకు వృషనామము కలదు. ఏ మేఘమునందు 'వృష' శూన్యమో,
జన్మ నిష్ఫలము. పురుషశరీరమున జలరూపము వీర్యము. "అపః రేతోభూ
శిశ్నం ప్రవిశతి" (ఉపనిషత్తు)
11. 'భంగీభక్త్యా విరచితవపుః స్తంభితాంతర్జలౌఘు' (మే. దూ 1-10)
12 కాళిదాసుని మణితములు రోగమున మణిపద్మము, మణికర్ణిక శే
మస్తిష్కము.
13 గర్భాధానక్షణ పరిచయాన్నూనమాబద్ధమాలాః
సేవిష్యంతే నయన సుభగం ఖేభవంతం బలాకాః [మే. దూ 2-9]

...నకు "జలలవముచ"అను నామకరణోత్సవము నైఘంటికులు చేయిం చి.

నిరుక్తకారుఁడైన యాస్కముని యీ సంస్కారమున సాధ్వ ...త్వము వహించిన ఋత్విజుఁడు. నిఘంటు (అ1, ఖం, 10) ప్రసంజలి ...తని యభిప్రాయప్రకారము మేఘునకు 'వృషంధి' యను నామము ...లదు. కాళిదాసిందుప్రని 'వృష' యనినాఁడు. మఱి మేఘుఁడు మఘ ...ని ప్రఖ్యాతానుచరులలో నొకఁడు[14]. ఇందుచే నాతఁడు వృషంధి[15] ...వలసినదే. యాస్కాచార్యుఁడు మేఘుని 'వరాహ' అనినాఁడు. ...ద్రిః ... ... పర్వతః గిరిః ... ... వరాహః ... ... ... ఇతి మేఘనామాని ... ... (నిఘంటువు 1-10) హిరణ్యాక్షదైత్యుని సం హరించి సలిలార్ణవమునుండి వరాహమూర్తి పృథ్వి నుద్ధరించె నని, పౌరాణికుల కథనము. సృష్టిపరిశీలకు లైన పండితప్రకాండులు మేఘుని వరాహరూపునిగ నెట్లు కల్పన చేసిరో చూచెదముగాక! 'వరం ఆహం ఇతి వరాహః' అని వరాహశబ్దమునకు వ్యుత్పత్తి. అనఁగా "వరమును ఆహననము' చేయునది. సూర్యునకు 'వర' నామము కలదు. అతని తేజమునకుఁ బ్రతిబంధక మగునది యగుటచే వరాహనామము కల్గినది. సృష్ట్యాదిని దాపమూర్తి యగు సూర్యునిగూర్చి హైమాండ, హిర ణ్యగర్భ, హిరణ్యాక్ష శబ్దములు ప్రయోగింపఁబడినవి. సూర్యుఁడెంత వఱకు ప్రతిహత భర్గుఁడై వెలుఁగుచుండెనో యంతవఱకు లోకలోకాం తరముల కల్పన మసంభవము. అతఁడు పృథివ్యాది లోకములను దన కుక్షిలో నిడుకొని సంహరించినట్లే యాలంకారికోక్తి. అతని జ్యోతి

14 ప్రకృతిపురుషం మఘోనః [మే. దూ-1-6]

15 తపః కృశామభ్యుపపత్స్యతే సఖీ వృషేవ సీతాం
తదవగ్రహక్షతాం [కు. సం. 5-61]

ర్మాయ శరీరమునుండి సృష్టిప్రక్రియను నడుపుటకు 'వరాహమని'
కతగల్గినది. నలుగడలఁ గాంతిమంతము లైన మంచుమేఘము
సూర్యమండలము నావరించినవి. కాలాంతరమున నా వేఁడిమి
గఁగా సూక్ష్మరూపము గల్గిన యా తైజస బాష్పమేఘములు
జలాదిరూపములు చెందినవి. పిమ్మటఁ గ్రమముగా గురుత త్త్వ
సంయోగముచే పృథ్వి జన్మించినది. సూర్యుని యందుఁగల య
యము, మొదలైన విద్యుత్స్ఫులింగీభూత (Radio active) ధాతు
క్రమముగ రూప పరివర్తనము నంది స్థూలధాతువుల యాకృతి
దుటకు వేల, లక్షల, సంవత్సరముల కాలము పట్టియుండు నని,
వేత్తల యుద్దేశము. ఇదియే మనసృష్టికి వారాహ కల్పము. భార
వేదాంత శాస్త్రమునఁ బిండగత, చైతన్యమునకు సంబంధించిన తు
సుషుప్తి స్వప్న జాగ్రదవస్థ లని నాలు గవస్థలు నిర్ణయింపఁబ
వీనితో సమానముగ బ్రహ్మాండవ్యాప్త చైతన్యమునకు సంబంధ
యవస్థలు బ్రహ్మ, ఈశ, హిరణ్యగర్భ విరాడవస్థలు. హిరణ్య
దశనుండి విరాడ్దశకు వచ్చుటకే 'వారాహము' యొక్క యా
కత గల్గినది. హిరణ్యగర్భదశలోఁ బ్రకృతి త త్త్వము సంచి
యున్నది.'విరాట్'అగుటకు, నలుగడల వ్యాప్త మగుటకై 'స్వయం
బ్రహ్మ దానిని యుపబృంహణము (శక్తివంతము) చేసెను[16].
ననే స్త్రీ పురుష భేదము కల్గినది. అనఁగా నొకే మూలశక్తి
ట్రాన్ ప్రోటాన్'' అను రెండు శక్తులుగ విభాజిత మైనది. సర్వజగ
రెండింట విభజింపఁబడినది. ప్రాణాపాన స్త్రీ పురుష, రయి (య
ప్రాణ, అశ్వనీయుగళ, మిత్రావరుణ, అగ్నిష్టోమప్రభృతియుగ్మ
సిద్ధించినవి. ఆ విద్యన్మహార్ణవమున స్వీయవిస్తరణమున కను

---

16 "తదంగ మభవ ద్ధైమం సహస్రాంశుసమప్రభం
తస్మిం జజ్ఞే స్వయం బ్రహ్మ సర్వలోకపితామహః (మను)

_క్తి తనంతఁ దాను, లోనుండి యుద్భవించును. అందువలన బరమాణువులు బహిర్ముఖములై వికీర్ణము లగుటకు మొదలిడును. వానివలనఁ గ్రమముగా లోకలోకాంతర సృష్టి జరుగును[17].

ఈ జగత్తున సామాన్యమానవునినుండి, చరిత్రకారులు, విజ్ఞాన వేత్తలు, కవులు నందఱు మేఘునిగూర్చి యెఱుంగుదురు. ఏ శాస్త్ర వేత్తనైన "మేఘ మెట్టిది?" అని ప్రశ్నింపుఁడు. అతని సమాధాన మిట్లుండును. 'ధూమజ్యోతిః సలిల మరుతాం సన్నిపాతః మేఘః' అనఁగా మేఘము కేవలము ధూమము, అగ్ని, నీరు, గాలియొక్క సమాహారము. తనపాండిత్యప్రభావమువలనఁ దానే ప్రకృతియొక్క నిగూఢ నియమముల సత్యమును గ్రహింపఁగల్గె నని యాతని గర్వము. వాయువునందు ధూమరూపమున సూక్ష్మాతిసూక్ష్మము లైన రజఃకణములు వ్యాపించి యుండును. వాయుసంఘర్షణముచే నవి విద్యుత్పరిగ్రహీతము లగును. అప్పు డావిరిరూపమున నంతరిక్షమున వ్యాపించియున్న జలము నవి తమపై కాకర్షించుకొనును. ఈ విధమున మేఘములై వర్షయోగ్యము లగును. ప్రత్యక్షరసత్యమయ్యు నీ కల్పన మెంత నీరసముగ నున్నది? వైజ్ఞానికుఁడు ప్రకృతి నిట్లే దర్శించును. ప్రకృతియొక్క యైశ్వర్యమయగుణములచే ముగ్ధులై యాశ్చర్యచకిత మగునట్టి మానవ ప్రవృత్తిని, శాస్త్రవేత్త తన రహస్యవివరణముచే నభిభూతము చేయఁ గోరును. శాస్త్రజ్ఞునకు మనోభావములులేనట్లే; భరద్వాజపక్షిని గూర్చిన వైజ్ఞానికవర్ణనమున నిరతము నిమగ్నుఁడగు విద్యావ్యాసంగి నిత్యమది పర్యటించివచ్చు వనంతలోకముల మఱచినట్లు. పాపము, కేవలము సత్యాన్వేషణమందే నిమగ్నుఁడయి స్వీయభావములకు

17 ధన, ఋణము లనెడి విద్యుద్భేదములు కార్యకాలసముత్పన్నములు. మూలమున విద్యుత్తు ఏకవస్తువే. శివుడు శక్తిమూలమున ఏకమే. వారు ద్వివిధములుగ గోచరించుచు, ద్విధాచుంబక ధ్రువములవలె వర్తింతురు.

దూరుఁడై యుండుటయే నూతని యదృష్టరేఖ. నిజమునకు నిరపే
సత్యోపలబ్ధి యెవ్వనికిఁ గల్గిన దింతవఱకు? ఇందుచేతనే కవి వరు
సంభావితసత్యమును వర్ణవ్యంజిత చ్ఛందః పాత్రముల నింపి మాన
హృదయముల కానందమును గూర్తురు. రససిద్ధుఁడైన కవిగూ
విజ్ఞానానుగత విమర్శనముచేఁ దృప్తి చెందియుండినచో మేఘదూత
వంటి కావ్యము జన్మించియే యుండదు.

"ధూమజ్యోతిః సలిలమరుతాం సన్నిపాతః" అనుదానిని వి
ర్శింపఁగా కవి కది యత్యంత రసవిహీనముగఁ దోఁచెను. అటువిమ్మ
దన యభిప్రాయము కవి రెండు పదములలోఁ జేర్చెను, "క్వమేఘ
ఓ వైజ్ఞానిక శిఖామణీ! 'ధూమము వహ్ని జలము, అను విచ్ఛి
భాగములు గల నీ మేఘ మెంత హేయము! నికృష్టము!' అని భావ
'క్వ'యను పదవ్యంజన మతి తీవ్రమైనది. కవిత్వము విజ్ఞానము సను
సందర్భమందుఁగాని, సత్యము, కల్పనలను వాని ప్రతిస్పర్థమందుగ
సర్వదేశములయందును, సర్వకాలములయందును కవులు తమ విప
లపై నెట్టి తిరస్కారభావమును వ్యక్తపఱచిరో దానినే కాళిదా
"క్వమేఘః" అను శబ్దద్వయ మంత్యంత సరళముగను, పరిభావ
ముగను వ్యక్తపఱచుచున్నది. జడములనుగూడఁ దన మనోభావ
సంపర్కముచేఁ జేతనములుగఁ జేయుటయందే కవియొక్క మహ
కౌశలము గానిపించును. ఇందుచేతనే ధూమ్మ, ధూమ, నీర, సమి
సన్నిపాతమునందే కాళిదా సనంతవిశ్వకల్పన చేయఁగల్గినాఁడు.

ఇఁక చరిత్రకారుఁడు.

చారిత్రకుని దృష్టిలో మేఘుఁ డెవరు?

జాతం వంశే భువన విదితే పుష్కరావర్తకానాం 'అన
పుష్కర, ఆవర్తకము లనెడి విశ్వవిశ్రుతము లైన మేఘవంశముల
జన్మించినవాఁడవు, అని వంశావళిని నిర్మించి యతనిని భువనవిదితుఁ

నిరూపించుటకై గుణగాథల నాలపించుటలోనే చారిత్రకుల యాయుష్షు గతించును. ప్రాచీన గౌరవపరిచయముచేఁ గల్గు నానందమే చరిత్రవిజ్ఞానమందుఁ గల్గు నానందము. కాని జడములై పోయిన చారిత్రకఘటనలకుఁ గావ్యమందలి యమరకల్పనలకుఁ గల సంబంధ మెట్టిది. నవనవోన్మేషమగు ప్రజ్ఞ కేవలము జడమగు చరిత్రాభ్యాసముచే నెట్లు మొక్కవోవఁగలదు? ఒకానొక విలక్షణ మైన యానందము నిరూపించుటకే కవికల్పన యవతరించును.

మన యక్షుఁడు యాచకుఁడై మేఘునిసమ్ముఖమునకు వచ్చినాఁడు[18]. మేఘునకు మాగధుఁడై తన దూతను బ్రియన్నునిగఁ జేసికొనఁగోరెను. అతఁడు తాను నిశ్చయించుకొనిన దూతకుఁ గులీనుఁడని ప్రమాణపత్రము నొసంగినాఁడు. కులముతోడిదే శీలము. శరణాగతరక్షణము (లేక శరణ్యత) సుశీల లక్షణముగదా?[19] యక్షుఁడు పుష్కరావర్తక మేఘముల ఘనత నెఱుంగును.

"ఆవర్తకే మహావర్తః సంవర్తే బహుతోయదః
పుష్కరే చిత్రితా వృష్టిర్ద్రోణేపి బహువారిదః" (బృహజ్జ్యోతిస్సారము)

అనఁగా ఆవర్తక మేఘములందుఁ బెద్దపెద్ద సుడు లేర్పడును. సంవర్తమందు జలసంచయము జరుగును. పుష్కర మేఘమునందుఁ జిత్ర, విచిత్ర వృష్టి కలుగును. ద్రోణనామక మేఘ మపరిమేయ జలరాశికిఁ బ్రభువు[20].

ఇంకను "యజ్ఞా నఘనా ఘోరాః పుష్కరావర్తకాదయః" (శబ్దారాళి) అనఁగా, పుష్కరావర్తక మేఘముల మహిమయే యని,

---

18 "తేనార్థిత్వం త్వయి విధివశాద్దూరబంధుర్గతోఽహం [మే. దూ 1-6]

19 "సంతప్తానాం త్వమసి శరణం (మే.దూ 1-7) హారీతుని ప్రకారము శీలమునకు సంబంధించిన పదమూఁడు గుణములు—బ్రహ్మణ్యత్వము, దేవ పితృభక్తి, సౌమ్యత్వము, అపరోపతాపిత్వము, మృదుత్వము, అపారుష్యము, మైత్రత్వము, ప్రియవాదిత్వము, కృతజ్ఞత, శరణ్యత, కారుణ్యము, ప్రశాంతత్వము.

20 విజ్ఞాన శాస్త్రము ననుసరించి మేఘములు నాలుగు విధములు. వాని ఆంగ్లనామ

యజ్ఞ సముద్భూతము లగుటకుఁ గారణము. విజ్ఞానశాస్త్రజ్ఞ
మేఘమును సృష్టించుటకుఁ గేవలము ధూమమే, చాలును; కా
సహృదయులుమాత్రము దానిని యజ్ఞధూమ మందురు. ప్రాచీన
హవ్య వనస్పతుల సూక్ష్మ వికరణముచే వాయువునందు సూక్ష్మధూ
కణములఁ గల్పించి, విద్యుత్పరిగృహీతములు గావించి, వృష్టిని గలు
జేయుటయందు, సఫలు లై యుందురు. కనీసము యజ్ఞక్రియయం
ననేక సదాశయములు దాక్షిణ్యయుక్త భావముల సన్నివేశము
దనుటమాత్రము స్పష్టము. ఆ పుణ్యాభిలాషతోఁ గూడిన యజ్ఞధూ
మము పైకిఁ బోయి ధూమయోని యైన మేఘముతోఁ గలియు
ప్రకృతిరూప మైన వేదియందుఁ దొమ్మిదినెలలుగా సూర్యకిరణము
చేయు యజ్ఞకర్మకు దాక్షిణ్యఫలముతోఁ గూడిన పుష్కరావ
మేఘములు సర్వస్వ దక్షిణవర్తితము చేఁగాని విశ్వ మంతటను జీ
(జల) ప్రదానముఁ జేయుచు సంచరించుచుండును.

విజ్ఞానవేత్తలను జరిత్రకారులనుగాక, కృషియే జీవనాధారము
గల యేగ్రామసీమయం దైనఁబోయి, మేఘుని రహస్య మే వ
ప్రశ్నించినచోఁ బ్రత్యుత్తర మి ట్లనివచ్చును.

---

ములు 1. సిర్రో (cirro) 2. క్యుములోస్ (cumulose) 3. స్ట్రేటస్ (str
tus) 4. నింబస్ (nimbus). వీని పరస్పర మిశ్రణముచే నవాంతరభేద
లేర్పడును. సిర్రోమేఘములు అయిదు మొదలు పదిమైళ్ళ ఎత్తున నన్నిటికం
నున్నతముగ నుండును. వీనియందు చిన్నచిన్న హిమకణ సముదాయముల దొ
రలు వ్యాపించియుండును. క్యుములోస్ మేఘములు భూమినుండి ఒక మై
ఎత్తున త్రికోణముగ వ్యాపించియుండును. వీనియందు నీటియావిరి చల్లనై
జలరూపము దాల్ప మొదలిడును. స్ట్రేటస్ మేఘములు నీహారాత్మకములై మిక్కి
క్రిందుగ వ్యాపించియుండును. ఇవి యుదయించుటచే దిక్కులు ప్రసన్నము
ఋతువుల సౌమ్యముగ గోచరించును. నింబస్ మేఘములు దట్టమై నల్లగను
జలరాశిచే నిండియుండును. వీనివల్లనే మూసల ధారముగ వృష్టిగల్గును.

"త్వయ్యాయత్తం కృషిఫల మితి, భ్రూవిలాసానభిజ్ఞైః
ప్రీతిస్నిగ్ధై ర్జనపదవధూలోచనైః, పీయమానః" [1-16]

ఓ గ్రామీణ జీవులారా! మీకు మేఘునియం దెట్టి ప్రేమ కలదు! ...నావధూజనలోచనములు మేఘుని యభిరామరూపమును పానము ...సే యుటకుఁ గారణము, మాకృషికిఁ బ్రవర్తకుఁ డగుటయేయని వా రందురు. ...మేఘాగమన మే కారణమున నైన, నొక మాన మాలస్య మైనచో, వన ...ప్రకృతి యంతయు,నాకసమువంక కాశావిస్ఫారితనేత్రములతోఁ జూడసా ...గును. మేఘునిను ఖావర్షము. ప్రకృతినయనముల కమృతప్రవము. అం ...దుచే మేఘునకు గ్రామములందు జరుగు స్వాగతమే యధిక స్వాభావి ...కము; సరళము; ప్రీతిస్నిగ్ధము. పురస్త్రీలు తమ కటాక్షములచే మేఘు ...నితో విలాసములు నెఱపుదురు. ఉజ్జయినీ నగరోన్మాదినులయొద్ద మేఘు ...ని కంతకు మించి యేమి లభించును?

"విద్యుద్దామస్ఫురితచకితై స్తత్ర పౌరాంగనానాం
లీలాపాంగై ర్యది, న, రమసే, లోచనై ర్వంచితోఽసి. [1-17].

...నగర స్వైరవిహారులగు స్త్రీపురుషులకు మేఘుఁడు కామోద్దీపకద్రవ్యము. ...మేఘురసనిపించనముతోడనే వారికిఁగూడఁ బరిమళోద్గిరణ మగుట ...మొదలిడును.

"[యః పణ్యస్త్రీ రతిపరిమళోద్గారిభి ర్నాగరాణా।ముద్దామాని ప్రథ ...యతి శిలావేశ్మభి ర్యౌవనాని]" [1-25]. కాని, గ్రామవధువులు ...భ్రూవిలాసముల వక్రగతు లేమాత్రము నెఱుంగరు. పూజ్యులు పరోప ...కారులు నగు నభ్యాగతుల నాహ్వానింపఁదగువిధమున వారు మేఘునకు ...స్వాగత మిచ్చెదరు. "ఏఁటేట నొకమాఱు విచ్చేయు యాత్రికా! దీర్ఘా ...యువును గల్గి యీ రీతిగనె రమ్ము; మా యింట నిలువంగ నెల్ల ...కాలమ్ము" అని పాడుచు మేఘుని దర్శనముచేఁ బులకించి యాతనికి ...వారు శతశతాశీస్సు లిచ్చెదరు. వృష్టి యెవరి శుభాకాంక్షుల కనువగు

ఫల మని ప్రశ్నించినచో, మన వేళ్లు లీ యమాయికపు గ్ర
టులనే చూపును. భ్రూవిక్షేపకుశలులైన పౌరాంగనల యుచ్ఛ
దీప్తస్థిర వాంఛపై నాధారపడి యాకసమందు మేఘమాలలు
దృఢతమ మగు సంయమి సూత్రబద్ధమైన జానపదజీవనమ
దీర్ఘకాయు లగు గ్రామీణులమీఁదనే రాష్ట్రసంపత్తియు దా
వృద్ధియు నాధారపడియున్నవి. అచట స్త్రీ, పురుషులకే మే
రహస్యము సరిగ ననుభవ మగును. వృక్షజాలమునను బశుజా
మేఘముచేఁ గల్గు పరివర్తనలకుఁ గృషీవలులే సాక్షులు. బ
గ్రంథములయందుఁ గృషి "స ర్వ దే వ తా మ యి"[21] యన
సూర్యుఁడు, వాయువు, మేఘుఁడు లేక యింద్రుఁడు, పశువులు,
రాజు, ప్రజ, వీ రందఱు వీణాతంత్రులవలె నేకమై యేకస్వర
కృషిసిద్ధి, లేక రాష్ట్రమున కన్న సంప్రాప్తి.

పైఁజెప్పిన విశేషజ్ఞులుగాక సామాన్యులు పైకిఁ
చూచిన వారికిఁ గేవలము మేఘునియొక్క వర్ణము, పరిమాణమే
ముగఁ గానఁపించును. వారికై కవి "ఆషాఢస్యప్రథమదివసే
మాశ్లిష్టసానుం, వప్రక్రీడాపరిణతగజ ప్రేక్షణీయం దదర్శ" అని
నాఁడు. మేఘ మన నేమి? కేవలము నల్లని భయంకరా
గల్గిన యేనుఁగువలె గుట్టలకు డీకొనుచు, గగ్గోలుసేయు జంత
సాధారణదృష్టి. మేఘ, గజసంబంధ మతి పురాతనము. వర్ష
లగు ప్రకృతి నియముల సముదిత నామము "ఇంద్రుడు". ఈ య
నకు నైరావత మనెడి యేనుఁగు వాహనము. మన యభ్రమ
నాముఁ డగు మేఘుఁడుకూడ, నింద్రునకుఁ బ్రధానపురుష
జెప్పఁబడినాఁడు. [1-6] సంస్కృతమున జలమును "ఇరా" యం
"ఇరా" యొక్క యక్షయ భండారము గల్గినవాఁ డగుటచే న

---

21. సర్వదేవత్యాత్కృషిః (శతపథ 7-2-2-12).

"ఇరావాన్" అను పేరు కల్గినది. అట్టి యిరావంతునందు జన్మిం
చి "ఐరావత" మగును."[22] దూరమునుండి దీనియాకార మేన్గను
 యుండుటచే నీ యైరావతగజమే మన యభ్రమాతంగము. పురా
ణలందుఁగూడ నింద్రుని యైరావతము, మేఘములతోఁ జరించునట్లు
్పఁబడినది. ఆవిరిరూపమున జలభస్మ మిందుఁగూడి యుండుటచేత
ముమును నభ్ర మందురు.

 ఎట్లన "అభ్రం వా, ఆపం భస్మ [శతపథ 7-5-2-14] ధూమో
త్వా అభ్రం భవతి,అభ్రంభూత్వా, మేఘో భవతి మేఘోభూత్వా
ర్షతి" [ఛాందోగ్య ఉపనిషత్ 6-10] అనఁగా:— సూర్యతాప
యోగముచే జలము భస్మ మగును. దాని మొట్టమొదటి యాకృతి జల
మము.(Vapour) దీనియందు జల ముండుటచే దీని నభ్ర మందురు.
యభ్ర మంతరిక్ష గామియై సాంఘాతిక రూపమున మేఘనామమును
ందును. మేఘుఁ డగుటచే నితనికి మేహన క్రియ జలవిసర్జనకు
ాగ్యత కల్గుచున్నది.

 సముద్రమందు జన్మించుటచే 'ఐరావతము'ను, జలమును దన
రమందు ధరించుటచే'అభ్రము'నను రెండువిధము లొకేపదమున నతి
ందరముగ వ్యక్తమగుచున్నవి. వర్ణపరిమాణక్రియలయందు సాదృశ్య
ుండుటచే మేఘున కేనుఁగు మంచియుపమానము. పురాణములలో
ముద్రమథనసందర్భమున నుదధినుండి యీ యభ్రమాతంగము జన్మిం
నట్లు చెప్పఁబడినది. ఇంద్రుఁడు తన యభ్రవాహన సాహాయ్యముచే
ముద్రమునుండి లేచి యాకసములోనికి వచ్చును. పుష్కలావర్తక
ేఘము లచట గుమిగూడి గర్జింపఁగా సాధారణముగ జనులు నేఁ

22. ఇరా ఆపః ఇరావాన్ సముద్రః తత్రభవః ఐరావతః అభ్రమాతంగః-మల్లి
నాథుని రఘువంశ సంజీవనీ టీకలో 1-36 మఱియు "ఐరావతో౽భ్ర
మాతంగః" అని అమరకోశము.

డింద్రుఁడు తన వాహనము నధిరోహించి వచ్చినాఁడు ; నేఁడు
కురియు నందురు. భరతదేశమున నింద్రునివాహన మైన నైర
పూర్వదిశాధిపతి యగు దిగ్గజముగ నెన్నఁబడుచున్నది. పూ
నైంద్రీ దిశయే ! ఏలన, భారతమాతయొక్క శ్యామలాంచలము
గాలులచేతనే వికసిత మగును. ఇచట వర్షమున నధిక భాగమున
మహోదధియందు బయలుదేఱు పవనములే తెచ్చును. మన
ధిదైవత మైన యింద్రుఁడు నతని వాహన మైన నైరావతమును, ర
చివరకుం మేఘునికి నామములే!

నిఘంటువు ననుసరించి నైరావతముభార్య పే రభ్రముపు. అ
శబ్దమును పలువిధముల వాఖ్యానింతురు. దాని శరీరమున వ
యుండు సౌందర్య శ్రీ, దాని సుందరగర్జ దాని జలనిర్భరమంథరత
కావచ్చును. ఐరావతపత్ని యైన[23] యభ్రముపు విద్యుత్తునకే మఱి
పే రని యింకొక స్థలమునఁ జెప్పఁబడినది. ఇవ్విధమున విద్యుత్క
డును[24] విద్యుద్వంతుఁడును[25]నగు మేఘుఁ డిరావతీ ప్రియుఁడై నై
తమును నొక్కటియే! విద్యుద్విహీనములైన మేఘములు వృష్టిదా
ములు గావని పైఁజెప్పఁబడినది. విద్యుద్రూపశక్తిచేతనే విద్యోతన
కును [మెఱయుటకును] గంభీరగర్జనమునకును ననువగు సామర్థ్య
త్పన్నమగుచున్నది. "విద్యుద్వా అపాంజ్యోతిః [శత-బ్రా9] వి
నైన యక్షుఁడుగూడ విహరించు మేఘుని 'నీకు విద్యుత్సప
వియోగము క్షణకాలముకూడఁ గలుగకుండునుగాత' యని యాశీ
చినాఁడు. "మాభూ దేవం క్షణమపి చ తే విద్యుతా విప్రయో

---

23. "అభ్రే భేమాతి, నభ్రా మేతివా, మంథరగామినీత్వాత్ ఇతి అభ్ర
అమరకోశము రామాశ్రమీ టీకలో.

24. విద్యుత్కళత్ర (మే. దూ 1-38).

25. విద్యుత్వంత (మే. దూ 2-1).

ఘ 2-62] అనఁగా, "నో మేఘుఁడా! నీయంకమందుండు విద్యుత్తు
ండి క్షణకాలముకూడ నీవు వేఱుగాకుము" అనుట. దానినుండి
త్రైనచో నీశోభ, నీమేఘత్వము, అంతయు శూన్యమునఁ గలసిపో
ను. నావలె కాంతావిశ్లిష్టుఁడ వైనచో నీ వేదేశముపోయినను
చట దుఃఖమే ప్రాప్తించును. కాలానుకూల్యములకు బదులు న్లావ
మనే కాంచెదవు. అచట నీసౌందర్యముగూడఁ దిరోహిత మగును.
ఱతి ప్రీతి స్నిగ్ధనయనములతో నీకెవ్వరుస్వాగత మిచ్చెదరు?నిన్ను గాంచి
మానందించుటకుబదులు ప్రజలు నిన్ను జూచి యేడ్చెదరు. నీప్రియ
మగు సౌదామినిని స్మరించెదరు.

ఈ సుదామాపర్వతపుత్రి యొకప్పుడు వలయాకారముగ మెఱ
సినచో మఱియొక వేళయందుఁ గనులు మిఱుమిట్లు గొల్పు క్షణప్రభ
గల్గిన చంచలతేజముచే దీపించును.[26] మఱియొక పట్టున ఖద్యోతపం
క్తివలె నల్పాల్పభాసముచే విలసిల్లును.

"అర్హా స్యంతర్భవనపతితాం కర్తు మల్పాల్పభాసం
ఖద్యోతాలీ విలసితనిభాం విద్యు దున్మేష దృష్టిమ్" (1-18.)

మేఘునివర్ణము:—వర్షాకాలమందలి మేఘుని కాటుకకొండ
లతోఁ బోల్చెదరు.మనమేఘుఁడుకూడ మెత్తగాపొడిచేయఁబడిన యంజ
జనపు రంగువాఁడు.[27] అతి సుందరుఁడు.[28] వర్ష ఋతువున నతని శోభ
ద్విగుణీకృత మగును.[29] వృషశక్తిపూరితులైనచో, నొక్క మేఘుం
డేమి? పురుషులు, స్త్రీలు, వృషభములు, అశ్వములు, అన్నిటి వర్ణ
మును స్నిగ్ధ శ్యామముగను పరమాభిరామముగను గోచరించును.

26. 'విద్యుద్దామ స్ఫురిత చకితైః (మే.దూ 1-17)
27. "స్నిగ్ధభిన్నాంజనాభే" (మే.దూ. 1-59)
28. "ప్రకృతి సుభగః (మే. దూ 1-40)
29. "ప్రావృషా సంభృతశ్రీః (మే. దూ 2-47)

మేఘుని శోభ పూర్ణముగ వర్ణించుట యసంభవము. ఇందుచే కవి యతనిని శివకంఠచ్ఛవితోఁ బోల్చెను. "భర్తుః కంఠచ్ఛవిరితి, గణైః సాదరం వీక్ష్య మాణః" [1-33.] తమ స్వామి శోభను దిలకించు నఖిలావనగల శివగణములా శోభచే నధిక శ్రీమంతమైన ప్రకృతి వస్తురూ పసుధను మనసార పానము సేయును. శివునికంఠవర్ణవిభూతి మెవరి కనుల యందు నిండిపోయినదో వారావర్ణాభాస మాత్రమెచటఁ గానుపిం చిన నచట నాత్మార్పణము చేయుదురు. సూర్య,చంద్ర, విద్యుత్ప్రభ శివుని బహుళజ్యోతియందు భాసమానములు కావో, అట్టి జ్యోతిర్దర్శ నము భక్తులకు మేఘుని యందుఁ గల్గినచో మేఘుని సౌభాగ్య తేజము లేమని వర్ణింపఁగలము? మేఘుఁ డననేమి ? కేవల మొక నామ రూపా త్మక వికారము మాత్రమే! పరమ శివతత్త్వ ప్రకాశమును జూపుటకు, కేవల మతఁ డొక ప్రతీకమైనను నతని జన్మ సఫలీ కృతమే. అతఁడు సమస్త లోక కళ్యాణోపార్జన చేసినట్లే.

ఇష్టవస్తు సౌందర్య పరాకాష్ఠను జూపఁ గల్గునట్టి యొకానొక యద్భుత చమత్కారము కాళిదాసుని కళయందుఁ గలదు. రఘువంశ మందు పదుమూఁడవ సర్గలో నతఁడు గంగా యమునా ప్రవాహ సంగమ వర్ణనముఁ జేయ మొదలిడెను. ఒకటి, రెండు, మూఁడు–నాలుగు,– ఇవ్విధము నన్గుపలచి సౌందర్యమును సాంతసీమనుండి వెలువరించి యనం తుని హస్తగత మొనర్చిన నాఁడో యన, శివుని శరీరశోభ యే దాని కుపమాన మనినాఁడు.

"క్వచిచ్చ కృష్ణోరగభూషణేవ, భస్మాంగరాగా తను రీశ్వరస్య,
నవద్యాంగి విభాతి గంగా భిన్న ప్రవాహా యమునా తరంగైః"

[రఘు 13-57] కృష్ణ సర్ప విభూషితమై భస్మాంగరాగవిలే పితమైనయీశ్వరుని శరీరముతోఁ దుల్యముగ నున్న యీగంగా,యమునా సంగమమును "ఓ యనవద్యాంగి సీతా! నీవు తిలకింపుము" అని దీని భావము.

ఆ శరీరముకంటెఁ బ్రశస్తతరమైన యుపమానకల్పనోద్దేశము నే భారతీయ కవియైన తన మనమున నిల్పినచో నతఁ డీదేశపు సనాతన కళా ధర్మములను దిరస్కరించినట్లే. దానిని మించిన శోభ యింకెచటఁ గలదు? అనంతమును మించిన, యనంతత యెట్లుండఁ గలదు ? సౌందర్యమునకు శివునితోఁ దాదాత్మ్యమే కలదు.

త్రిభువనగురు వైన చండీశ్వరుని కంఠచ్ఛవి కేవలము ప్రతీకరూపమునసే వ్యక్త మగును. గాని దాని సమగ్రవర్ణన మెవరు చేయుదురు! అంతియే! మేఘునిశోభకూడ నట్టి యుపమానముతో ననంతమైపోయినది. ఆసౌందర్యప్రయోజనముభోగము కాదు. ఈశ్వరసమర్పణమే. ఈస్థితికి వచ్చినపిమ్మటనే మనము "ఓ నారీ! నీ నామమే పవిత్రత, సౌందర్యము" అని యందుము. తన సాయంకాల తేజమును, శివునినృత్యసామగ్రీరూపమున నర్పణసేయవలసిన దని కవి మేఘుని గోరెను. తన క్షణభంగురచ్ఛవిని మేఘుఁడు నటరాజుయొక్క యవినాశనృత్యశోభ నినుమడింపఁ జేయుటకై యర్పింపవలసిన దని కవియాదేశము.[30] కామదేవుని భస్మావశేషునిగఁ జేసిన కుబేరసఖుఁడగు సాక్షాచ్ఛివుడునివసించు నలకాపురీప్రదేశమునకు మేఘుఁడు పోవలసియున్న దని మేఘసందేశమునాదినుండి తుదవఱకు జ్ఞప్తి యందుంచుకొన వలసిన విషయము. ఇందుచేతనే మేఘుఁ డాలోకమునఁ దన చాపము నెక్కువెట్టుటకు భయపడును.

మేఘునితో నింద్రధనుస్సునకు సాహచర్యము గలదు. సాతపమేఘాగ్ర భాగమున వివిధవర్ణసమన్విత మైన యింద్ర చాపము విలసిల్లును. ఆకసమందలి యావిరి జలబిందు రూపముఁ జెందు ననియు, నట్టి

30. "పశ్చా దుచ్చైర్భుజ తరువనం మండలేనాభిలీనః
సాంధ్యం తేజః ప్రతినవజపాపుష్పరక్తం దధానః
నృత్తారంభే హర పశుపతే రార్ద్రనాగాజినేచ్ఛాం
శాంతోద్వేగ స్తిమితనయనం దృష్టభక్తిర్భవాన్యా" (మే. పం. 1-36)

మేఘము సూర్యకిరణముల మార్గమునఁ బడగా, నా ప్రకాశ కిరణవ
విభిన్న ఘనత్వము గల్గిన పొరలద్వారా పోవలసి వచ్చుటచేఁ గిరణవ
వికీర్ణములై విడివిడిగఁ గానవచ్చు ననియు విజ్ఞానవేత్తల కథనము.
సప్తపాతాళ పర్యంతమును బోయి,సత్యమను గవ్వను బెల్లగించు కో
కవికి లేదు. అతని కింద్రధనువున నద్భుతమైన యింద్రజాలము క
గోచర పదార్థములందు దా శోభకుఁ దగిన యుపమానము దొ
పోవుటచే నతఁడు "రత్నచ్ఛాయా వ్యతికర"మని కల్పనచేసినాఁడు.
యీ నవోత్పాదనముచేత నతనికి సంతసము గలుగలేదు. అ
ద్వాపరయుగలోని గోపకునిశృంగారము తలఁపునకు వచ్చెను.
'భర్తుః కంఠచ్ఛవిరితి'కి సమానమున వసంత సౌందర్య వ్యంజన

"యేన శ్యామం వపు రతితరాం కాంతి మాపత్స్యతే తే
బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః"

అని లిఖించినాఁడు. క్షీరసాగరమున శేషతల్పముపై యోగమా
మాశ్రియమునఁ జాతుర్మాస్యమును సల్పు సమయమున, బాహ్య
చమున కాతని యభిరామరూపమును మేఘుఁడు స్ఫురింపఁజేయ
యనునట్లు తోఁచును.

కాళిదాసు మేఘుని 'కామ రూప' మనఁగా నిచ్ఛానుసా
రూపమును మార్చుకొనువాఁడు యనినాఁడు. విజ్ఞానవేత్తలుగూడ
సర్వత్రవిహారదక్షతను నంగీకరించినారు. ఆకసమున నొక సమయ
నడ్డముగ గోచరించును. మఱియొకప్పుడు నిలువుగను మఱియొక
వెనుక భాగమున వ్రేలాడుచుండునట్లుగ నుండి నీటు ద్రాగుటకై యొ
యేనుఁగువలెఁ గనఁబడును. ఈతిరశ్చీన దీర్ఘప్రసారిత రూపమున భు
దిగివచ్చుట యతనికి సులువు. మఱియొకప్పుడు తోయోత్సర్గముచేఁ
కమైయాకాశమునదు్రితగతితో జాలుచుఁబోవును.[31] ఇంకొకసమయ

31. "తోయోత్సర్గద్రుతతరగతి స్తత్పరం వర్త్మతీర్ణః" (మే. సం. 1-11)

అంతర్ఘనత్వముచే మంథరగతితో మందమందముగఁ జరించును. మేఘ దూతి మందలి మందాక్రాంత చ్ఛందమునకును మేఘుని మందగతికిని బ్రాకృత సంబంధము కలదు.

దేశ కాలములు రెండును విలుప్తములైపోవలయు ననియు, నఁగాఁ దనమాత్ర, క్షణమాత్రము నలకాపురిఁ జేరవలయు నని యక్షుని హృదయ పూర్వక మైన వాంఛ. కాని దేశకాలపరిచ్ఛిన్నులైన మర్త్యులు మాత్రి విధా నియతిద్వయానుశాసనమును శిరసా వహింపవలసి నదే. ఆకాశ మార్గమునఁ బోవు మేఘుఁ డెన్ని పర్వతాటంకములు దాఁటవలెనో యెఱుఁగము.

"ఉత్పశ్యామి ద్రుతమపి సఖే! మత్ప్రియార్థం యియాసోః
కాలక్షేపం కకుభసురభౌ పర్వతే పర్వతే తే" మే. సం. 1-22

ఓసఖుఁడా! నీ వెంతత్వరగ బోవువాఁడ వైనను మార్గావరోధక ములై నిలుచు పర్వతములచెంతఁ గాలక్షేపము గాకుండ పోఁగల్గుట సంభ వముకాదు. అని భావము. కాని యొకమాటమాత్రము హృదయ మం దుంచుకొనుము. "మందాయంతే న ఖలు సుహృదా మభ్యుపేతార్థ కృత్యాః (మే. సం. 1-38) భౌతిక వ్యవధాన మెట్లైన నుండనిమ్ముగాని నీ యుత్సాహముమాత్రము మందగింపరాదుసుమా! యని.

తేలికయైన మేఘములను వాయు వెగురఁ గొట్టి చిందఱవందఱ చేయుట యందఱుఁ జూచిన విషయమే. గంభీర జలరాశిచే నిండిన మేఘ ములే గాలి కెదురుగ నిలిచి వర్షించును. పాలిపోయి పలుచఁబాఱిన వ్యక్తికి గౌరవము లభించుట యరిదిగదా! ఘనముగ వర్షించు మేఘ ములచేతనే యక్షుఁడు కోరు సందేశవాహకత్వము సంభవము. కావుననే

"అంతస్సారం ఘన తులయితుం నానిలః శక్ష్యతి త్వాం
రిక్తః సర్వోభవతి హి లఘుః పూర్ణతా గౌరవాయ" మే. సం 1-10

యని జ్ఞాపకముచేసినాఁడు. అనఁగా నో మేఘుఁడా! నీవు జలముచే నిండి

యున్నచో౯ బెనుగాలిమాత్రము ని స్నేమిచేయఁగలదు. య
బలవంతుని యధికారము నందఱు నొడలఁదాల్తురు. అల్పులక
అప్రతిహతవేగమునఁ బ్రవహించు కాలప్రవాహమునఁ గొ
పుటదప్ప వేఱుగతి శూన్యము. 'అంతస్సార' మందలి వ్యంగ్య
తియు సుందరము. మేఘుని నామము 'వృష' యని యీవఁ
బడినది. వృషకు రేతస్సు లేక వీర్య మని పేరు.[32] బ్రహ్మచారియై
అనఁగా నెవఁడు వృష సంపన్నుఁడగుటచే నంతస్సారవంతుఁడో
ప్రాణాయామ రూపమైన యనిలాఘాతము నోర్వఁగలఁడు.వృ
నులను విషయములు తమ యిచ్చవచ్చినట్లు త్రిప్పును.అట్టివారి
కము (ప్రాణాయామక్రియ) సిద్ధింపదు. మరియొక విశేషము.
'ఓకసారీ' యని పేరు. [33] అనఁగా నెవని యింటియందు (ఓ
సారము నిండియున్నదో యతఁడనియర్థము.[34] అలకాపట్టణ
'వస్వోకసారీపురీ' యని గలదు. [35] అనఁగా 'వసురూపసారవ
ములందు నిండియున్న పురము' అని భావము. మేఘుఁ
ముఖ్యానుచరుఁడు. అతఁడు'అంతఃసార'మై యలకాపురియందుఁ
లెను. ఇంద్రుని నామమే వసువు. [36] ఇంద్రశక్తికి నివాసస్థానమై

32. రేతో వై వృషయః - శతపథ 7-3-1-46
ఆపో వై రేతసి శ్రితః - తైత్తరీయ బ్రాహ్మణ. 3-10-8-6
శరీరమందు జలము రేత రూపమునఁ గలదు అని భావము.

33. ఓకసారీ వా ఇంద్రః - ఐతరేయ బ్రాహ్మణ 6-17-37.

34. గృహా వా ఓకః - ఐతరేయ - 8-26

35. "వసతిం వసుసంపదాం" - కుమారసంభవము 6-3
వసు ఓకసారీ-"అత్యర్థమ్యాంతర్భవవ నిధయః" యక్షభవనములంద
నిధులుండినట్లు మేఘసందేశమున చెప్పబడినది.

36. స ఇంద్రో వై దేవానాం వసుర్వసో హ్యేషాం - శతపథ 1-6-
ఇతఁడు దేవతలకు వసువు,అని అర్థము.

ం 'వస్వోకసారీపురీ'యగును. విరాట్పురికృతికి మేఘుఁడే వృషశక్తి
ైన యింద్రుఁడు. అందుచే నతనికి 'అంతఃసారీ'యను విశేషణము
'యముగఁ గూర్పఁబడినది.

వర్షానుకూలస్థితికై యనుకూల పవనముకూడ నావశ్యకము.
పూరితములై వచ్చు మేఘములను బ్రతికూల వాయువులు చించి
డును. మేఘము లెంత యభ్రత్వ విశిష్టములైనను ననుకూలపవన
లేక వర్షింపఁజాలవు. అందుచే యక్షసఖుఁ డైన మేఘుని మంద
ము ప్రోత్సహించుచున్నది.

"మందంమందం నుదతి పవన శ్చానుకూలో యథా త్వాం
మే. సం. 1-9

ాతి వర్షమునకు పసరిక (పచ్చనిచెట్లు చేనులు) యావశ్యము.
పవనప్రదేశములం దావిరి త్వరగ జలరూపమును దాల్చును. కవి
విషయమునుగూడ సూచించినాఁడు.

"స్థిత్వా తస్మి న్వనచరవధూభుక్తకుంజే ముహూర్తం
తోయోత్సర్గద్రుతతరగతి స్తత్పరం వర్త్మతీర్ణః.

ఁగా నామ్రకాననసఘనకుంజములందు నీవు నిలుచునపుడు బొమ్మ
పమున సంచిత మైన నీ జల మచట వర్షించుము. ఇందుచే నీవు తేలి
ై ద్రుతగామి వయ్యెదవు. రేవానదీజంబూకుంజములందుఁగూడ నీవు
ంతవృష్టి వయ్యెద అని భావము.

ఘన మెత్తునకుఁ బోయినకొలఁది దాని వేఁడిమి తగ్గుఁగును. తత్ఫ
ముగ వర్షము గలుగును. ఇది వర్షసంబంధి యైన మూఁడవ రహ

37. యాం దిశం వాయురేతి తాం దిశం వృష్టిరన్వేతి - శతపథ 8-2-3-5.
వృష్టి యనుకూలవాయువున కధీనమై యుండును;

స్యము. మాలక్షేత్ర వర్ణనమున[38] ధ్వనిరూపమున సీతత్త్వమునకు
సూచనచేయఁబడెను.

సద్య : సీరోత్కరణ సురభిక్షేత్ర మారుహ్య మాలం
కించి త్పశ్చా ద్వ్రజ లఘుగతి ర్భూయ ఏవో త్తరేణ

మే. సం.

ఆరోహణానంతరము వృష్టి, యటుపిమ్మట దాని ఫలస్వరూపమైన
గతివైపునకు ధ్యాన మాకర్షించి పైఁజెప్పిన యభివర్షణ వర్ణ
మించట ప్రచ్ఛన్న రీతిని జేయఁబడెను. [39]

వర్షానంతరము భూమినుండి పరిమళ సుగంధము బయలు దే
"దగ్ధారణ్యే ష్వధిక సురభిం గంధ మాఘ్రాయ చోర్వ్యా

మే. సం. (1-2

దావానలదగ్ధము లైన వనములందు, మేఘుఁడు తన జలముచే భ
పము నడంపఁగా, దానినుండి సుగంధము పుట్టును. ఎన్ని సుగంధిత
ములు, ఎన్ని హవ్యవనస్పతులు, దావాగ్నిచే భస్మమై భూమియ
గలసిపోవునో యెవరికెఱుక? అట్టిస్థలమున వర్షించిన మేఘుఁడును నా
త సుగంధముచేఁ బరితృప్తిఁ జెందును. దావానలమును శాంతింపఁజే
పురుషార్థము కేవలము మేఘుని దే.

త్వా మాసార ప్రశమితవనోపప్లవం సాధు మూర్ధ్నా
వక్ష్య త్యధ్వశ్రమపరిగతం సానుమానామ్రకూటః

సమస్త సంతప్త సృష్టికిని మేఘుఁడు నిజముగ శాంతి గూర్చును.
సనే కవి యతనిని సంతప్తానాం త్వ మసి శరణం(1-7) అని పొగడినా

---

38. మాల క్షేత్రము – నేపాలునకుఁ దూర్పుదిశయందున్న యొక ప్రదేశము.
39. సద్యస్తత్కాలమేవ సీరైః హలైః ఉత్కర్షణేన సురభిఘ్రాణ తర్ప
యథాతథా ఆరుహ్య తత్ర అభివృష్యయిత్యర్థః – మల్లినాథుఁడు.

మేఘుని పయనమందే యన్నిచోటులం గాళిదాసు వర్ష వర్ణనము
ముచుం బోయెను. కాని, పర్వతప్రదేశములం జేరిన పిమ్మట స్థితి మాఱి
ృను. కొలంది వర్షము పడి, చలిపెరిగి యచట నాకాశమందలి జలము
మరూపమును దాల్చును. ఇందుచే నచటం జిట చిట వడగండ్లె పడ
ందలిడును. కావుననే కనఖిల ప్రదేశము 40 దాఁటిన పిమ్మట వర్ష వర్ణ
ు వచ్చినపుడు నీరు వడగండ్ల రూపము దాల్చినట్లుగ వర్ణించెను.

"యే సంరంభోత్సవ రభసాః స్వాంగభంగాయ తస్మిన్
ముక్తా ధ్వానః సపది శరభా లంఘయేయు ర్భవంతమ్
తా న్కుర్వీథాస్తుములకరకావృష్టి పాతావకీర్ణాన్
కేవానన్యః పరిభవపదం నిష్ఫలారంభయత్నాః" మే.సం. 1-56

నఁగా, శరభమృగములు పైకెగిరి నిన్ను దాఁటిపోవఁ బ్రయత్నించినచో
ానిని హిమఖండములచేఁ గట్టిగ మర్దింపుము అని. ఈశ్లోకమందలి
యాధ్యాత్మిక భావ మత్యంతము మనోహరము. మేఘసందేశమందుఁ
గల వృషశక్తి మీమాంసలోని దుర్ధర్షత్వమిందుఁ బ్రతిపాదింపఁ
డినది. కామమును యోగసంయమముచే నిర్జించి, సాధనతో ముం
దుకు సాగునట్టి యేమార్గము కలదో దానిని నిరాదరించి కామమును
నిర్జింపకయే, యితరమార్గముల నవలంబించి ఒక్క యుదుటున సిద్ధిని
బొందఁదలచినవారు చివరకు వృషశక్తి యధోముఖపతిత మగుటచే
నవకీర్ణులై యనఁగా ఖండితబ్రహ్మచర్యవ్రతులై పోయెదరు. వారి ప్రయ
త్న మంతయు నిష్ఫలమైపోవును. శ్లోకమందు 'అవకీర్ణ' యను శబ్దము
జ్యోతివలె సమస్తార్థమును గాంతివంతముఁ జేయుచున్నది. ప్రతిము

40. కనఖిల= హరిద్వార సమీపమందలి యొక తీర్థ విశేషము.

చెడిన బ్రహ్మచారులను నవకీర్ణు లందురు. సప్తమధాతువైన యో
నెవఁ డెవ్విధమునైన జాఱవిడుచునో యతఁ డవకీర్ణుఁడు.[41]

మనుష్యుఁడు వాజసంపన్నుఁ (వాజీ) డగుటకు, అనఁగాఁ
వాజ (వృష) శక్తిని దనయందే నింపుకొనుటకై యేక రేతస్కుఁడు
కేవల యూర్ధ్వరేతస్కుఁడు కావలయును. అతఁడు తన సమస్త పా
వులను[42] (రేణువులను) స్వాత్మతోనే పానము చేయలేకపోయిన
బాంసుఁడు లేక ద్విరేతస్కుఁడై పోవును.

(శతపథ 4-5-1-

మేఘాగమనముచేఁ జెట్లుచేమలు నోషధులు, నూర్జముగఁ బె
రెట్లు వీర్యవంతము లగునో యట్లే జంతుజాలమును నానందోద్రేకవ
జెందును. చేతనదృష్ట్యా పశువులు, మనుష్యులు, వనస్పతులు, స
యును విశ్వవ్యాప్తమైన మహాప్రాణమునకుఁ బరాపరభేదమాత్రము
విరాణ్మేఘుని ప్రభావము సర్వత్రఁ జూపట్టును. చరాచరములనెడి కా
నిక సీమలను దాఁటి యేకైక చైతన్యమును దర్శించినపుడే మేఘునం
వెల్లరకును జరితార్థము కాఁగలదు.

---

41. "అవకీర్ణీ భవే ద్గత్వా బ్రహ్మచారీ తు యోషితమ్ - యాజ్ఞవల్క్య
యోషాభిగమనముచే బ్రహ్మచారి అవకీర్ణుఁడగును.
బ్రహ్మచారీ, ఉపకుర్వాణో, నైష్ఠిక శ్చేతి యోషితం గత్వా, అవకీ
తత్తు యస్యాస్తి సో అవకీర్ణీ (విజ్ఞానేశ్వర)
స్త్రీ సంపర్కా ద్విప్లుత బ్రహ్మచర్యః అవకీర్ణీ (మను, కుల్లూక)
42. పాంసు = రేత, రేణు = వీర్య, వాజ = వృష.

---

మూలము:—డాక్టరు వాసుదేవశరణ్ అగ్రివాల్,
M. A., PL. D గా
నాగరీ ప్రచారిణీ పత్త్రిక
విక్రమ. 2006—54 వ సంపుటము
పత్రిక 2—3 లోఁ బ్రచురితమైన హిందీ వ్యాసమునకు
స్వేచ్ఛానువాదము

# కల్యాణపురీ ప్రశంస

(బంఙారు తిమ్మయ్య)

[ నేఁడు హైదరాబాదు రాష్ట్రములో, బిదరు జిల్లాలో గుల్బర్గాకు రమారమి యేఁబదిమైళ్ళ దూరముననున్న కల్యాణమను గ్రామము పూర్వము పశ్చిమ చాళుక్య రాజధానియై బహువిభవా కరమై ప్రసిద్ధి నొందియుండెను. దీనినిబట్టియే పశ్చిమ చాళుక్యులకుఁ గల్యాణ చాళుక్యు లనువ్యవహార మేర్పడినది. క్రీ॥ శ॥ 1060 ప్రాంతమున నిచ్చటఁ బరిపాలన మొనర్చిన యాఱవ విక్రమాదిత్యుని యాస్థానమున బిల్హణుఁడు, విజ్ఞానేశ్వరుఁడు నాస్థానకవులుగా నుండెడివారు. వీరిలో రెండవ యాతఁడు రచించిన "విజ్ఞానేశ్వరీయము" అను ధర్మశాస్త్ర గ్రంథమున "నాసీదస్తి భవిష్యతి క్షితితలే కల్యాణ కల్పం పురమ్" అనియున్న ప్రశంసవలన నప్పటి యాపట్టణవైభవము వ్యక్తముకాఁగలదు. క్రీ. శ. 1160 ప్రాంతమున నిచ్చటఁ బాలన మొనర్చిన తైలపదేవుని నాతని దండనాథుఁడు బిజ్జలుఁడు సింహాసన భ్రష్టునిఁగావించి పశ్చిమ చాళుక్యరాజ్య మాక్రమించెను. వీరశైవ మతోద్ధారకుఁడగు బసవేశ్వరుఁడ క్కాలమున బిజ్జలుని ప్రధానమంత్రిగానుండెను. అప్పుడు బసవేశ్వరుఁ డచ్చట నిర్మించిన శివానుభవ మంటపము గొప్ప యాధ్యాత్మిక నిలయమయి విలసిల్లెను. దానికి అల్లమప్రభువధ్యక్షుఁడు. భారత దేశము దశదిశలనుండి జ్ఞానులచ్చటి కేతెంచి తమ తమ శివానుభవములను వెలార్చుచుండిరి. వారి యాయనుభవద్యోతక వాఙ్మయమే నేఁడు కర్ణాటభాషలో వచనవాఙ్మయ మనుపేర విశిష్టస్థానము వహించుచున్నది. ఇట్టి కల్యాణ కటకము, దేశము తురుష్కాక్రాంతమయి తురకల దొరతనము నెలకొనిన పిమ్మటఁ దొంటి వైభవమును గోల్పడి నేఁడు సామాన్యగ్రామముగానున్నది. బసవనికాలము

నుండి యిది బసవకల్యాణమను పేర వ్యవహృతమగుచున్నది. ఆనా
నన్ని వేశముల శిథిలావశేషములను పురాతత్త్వ పరిశోధక శాఖవా
సంరక్షించుచున్నారు. ఈపట్టణమందలి భక్తిగౌరవములచే వీరశై
సోదరు లీసంవత్సరము జనవరి 29-30 తేదులను అఖిలభారతీయ
శైవమహాసభయొక్క షోడశవార్షికసభ నిచ్చట సమావేశమొ
ర్చిరి. అందు శ్రీ మైసూరు మహారాజుగారు ప్రారంభోపన్యాసమొ
గిరి. వీరశైవులు వేలకొలంది నలుదిశలనుండి యరుదెంచిరి. ఈక్రి
పద్యములానాటి సమావేశములో భావావేశమునఁగూర్చి చదివిన

శా. కల్యాణాఖ్యపురంబ! పశ్చిమ చళుక్యాధీశ సంస్థానమై
కల్యాణాత్మకుఁడై, సమస్తజగతీ కల్యాణసంధాయధీ
కుల్యా(శ్రేణుల నోలలాడు బసవాఖ్యుండిచ్చు సాన్నిధ్యసా
కల్యంబొందుచు ధన్యవయ్యునిటు దుష్కాల ప్రభావంపు వై
కల్యంబందిన నిన్ను నేఁడుగనులన్ గాంచంగఁ గట్టా! మన
శ్శల్యంబౌ చది గూర్చుకున్న భరమా సంతాప మెవ్వారికిన్.

ఉ. భారతభూమియందు నలువైపులనుండియుజ్ఞానవృద్ధులిం
పారఁగనిందుఁ జేరుచును నాత్మశివానుభవంబులెల్ల వె
ల్వారఁగ గేయరూపముల వర్ధిలఁజేసిరటంచు విందుమా
ధీరుల దివ్యసన్నిధిని దేజము నొందిన నీదు భాగ్యమే
తీరునఁ గల్గనేర్చు మఱి దేనికినైనఁ బురీవతంసమా!

శా. తల్లీ! నీదగు పూర్వవైభవముఁ జిత్తంబందు ధ్యానించు లే
యుల్లంబూఱటనొందు సాధనముగా నూహింతు మేమింక నీ
తొల్లింటున్నతి నేఁడు శేషమయినన్, దోఁపంగరానీకదా
నెల్లన్ మాయఁగఁజేసినట్టి విధిని యేరీతి దూ అందగున్.

సీ. మడివాలు ♦ బిజ్జలు మత్తకరిమదమ్ము
నణఁగించి చెండాడి నట్టిచోటు
గేయచారిత్రుఁడౌ కిన్నర బ్రహ్మన్న
కథవుడోయని పల్కినట్టి నెలవు

♦ మడివాలు మాచయ్య

పరవాదులు భజింప బసవయ్య శివనాగ
మయ్యఁగొని యూరేఁగినట్టి రథ్య
అల్లమ ప్రభునకు సర్మిలి బసవేశుఁ
డాత్మార్పణమొనర్చినట్టి వసతి

గీ. ఎంతొ దూరంబునుండి యేతెంచినట్టి
మమ్ముఁ గరుణించి కడువాద రమ్ముతోడఁ
జూపఁగదవమ్మ ! మేము విశుద్ధులమయి
జన్మము తరింప నిండ్లకుఁ జనకమున్న.

చ. అనుపమభక్తియుక్తి బసవాఖ్యుఁడు మున్నిట మూఁడుప్రొద్దులం
దను దినమున్ మహాప్రమథు లట్టులుగూడెడు భక్తకోట్ల య
ర్చనముల వేడ్కఁ జేసినతె అంగనొకించుక తెల్పవో యవన్
ఘనమతి నిష్ఠకూడిన గణాంబుల కంజలిఁగూర్చి మ్రొక్కెదన్.

చ. బసవని తోడ మున్న తని పజ్జనుసందు వసించి సత్క్రియా
వసరములందు నాతనికి బాసటయై చను జిత్సుఖాబ్ధి వె
క్కసముగ మగ్నులై గణనగాంచిన మాచయ బ్రహ్మయాదులన్
అసమగుణాఢ్యులన్ దలఁతు నందఱ నేఁడిటఁ జిత్సుఖార్థినై.

---

బసవ కల్యాణమండలి భక్తి కలన
నేఁడచటఁగూడు షోడశ నిఖిలభార
తీయ వీరశైవ సభాంగ దివ్యసన్ని
వేశములయందు భక్తిసంవేశమునను
ఆపురీ విభవప్రశం సాత్మకముగ
భక్త బండారు తమ్మయార్యుఁడు గూర్చు
పద్యషట్కంబిది యభవు భవ్యకరుణ
వఱలుఁగావుత శివభక్త వర్గములను.

---

# వ్యక్తివివేకము

శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ,

## అనౌచిత్యభేదములు.

అనౌచిత్యము రెండు రకములుగ నున్నది. (1) అర్థ విషయ
(2) శబ్దవిషయము. ఇందు మొదటిది అన్తరంగానౌచిత్యము. రెండ
బహిరంగానౌచిత్యము. విభావానుభావవ్యభిచారి భావములను రస
గుణముగ వర్ణింపవలసిన రీతిన వర్ణింపకుండుటయే యన్తరంగానౌచి
మునకు లక్షణము. అన్తరంగ మగు నీ యర్థానౌచిత్యమును, ఆనంద
నాచార్యప్రభృతులే "వ్యభిచారి రస స్థాయిభావానాం శబ్ద
చ్యతా—అనంగస్యాభిధానం చ రసే దోషా స్స్యురీదృశాః" "అనౌ
చిత్యాదృతే నాన్యత్ రసభఙ్గస్య కారణమ్ ప్రసిద్ధౌచిత్యబన్ధస్తు రసస్యో
నిషత్పరా" మొదలగు శ్లోకములయందు నిరూపించిరి. అందుచే దా
నిటఁ దిరిగి వర్ణించుటలేదు. బహిరంగ మగు శబ్దానౌచిత్యము బహుప్ర
రముల నున్నది. (1) విధేయావిమర్శము (2) ప్రక్రమభేదము (3) క్ర
భేదము (4) పౌనరుక్త్యము (5) వాచ్యావచనము.

ఒక వృత్తముయొక్క "దుశ్శ్రవత్వము" కూడ శబ్దానౌచిత్య
యగును. కాని, అనుప్రాసాదులవలె దీనికిఁగూడ రసానుగుణ్య ముం
టయే యభీష్ట మగుటచే నర్థాశ్రయముగూడ నగుచున్నది. విధేయా
విమర్శాదులవలెఁ గేవలము శబ్దాశ్రయము కాదు. అందుచే దుశ్శ్రవ
దోషమునుగూడ విధేయావిమర్శాదులతోఁ గలిపి శబ్దానౌచిత్య
ముల క్రింద నీయలేము.

## అనౌచిత్య లక్షణము.

"వివక్షితరసాదిప్రతీతి విఘ్నవిధాయిత్వము"— ప్రతిపాదిం
పఁదలఁచిన రసాదుల ప్రతీతికి విఘ్నమును గలుగఁజేయుట" యే యనౌచి
మునకు, సామాన్య లక్షణము.

ఇఁక శబ్దార్థాచిత్యములకుఁ గల భేద మేమన, అర్థానౌచిత్యము రసప్రతీతికి సాక్షాత్తుగ విఘ్నమును గలుగఁజేయును. అందుచేతనే యిది యన్తరంగమైనది. శబ్దానౌచిత్యము పరంపరా సంబంధముచే రసప్రతీతికి విఘ్నము నాపాదించును. అందుచే నిది బహిరంగ మైనది.

విధేయావిమర్శము మొదలుగాఁ గల యీ యనౌచిత్యములే విధేయావిమర్శాదిదోషము లని పిలువఁబడుచున్నవి. ఖలులవలె నీ దోషముల నన్నిటి నిఁక వ్యాఖ్యానింతును

అనౌచిత్యమునుగుఱించి బోధింపుఁ డని శిష్యు లడిగినారు. ఎవరైన నొక ప్రశ్న నడిగినపుడు సమాధాన మీయనిచో నీతనికి సమాధానము తెలియదా? తెలిసినను, ప్రశ్నకు సమాధానము చెప్పవలె నను నాచారము నితఁడు పాటించుటలేదా? లేక యితరులకు సమాధానము చెప్పవలయు నను మాత్సర్యముచే మౌనము వహించినాఁడా? యని పలుపలురకముల సంశయింతురు. ఆ సంశయములకుఁ దావు లేకుండుటకై, కేవలమభాగ్యులుమాత్రమే యనుసరించునట్టియు, సత్పురుషులు సేవింపనట్టియు, ఇతరుల దోషములనే చూపునట్టియు నీ మార్గము (పౌరోభాగ్యమును) నవలంబించి యీ వ్యాఖ్యానమున కుపక్రమించుచున్నాను.—

"నీ వ్రాతలలో దోషములు లేవా? నీ రచనము లన్నియు దోషభూయిష్ఠములుగ నుండఁగనే యితరులలో దోషముల నెంచదవేల?" అని యెవరైనను నన్ను బ్రశ్నింపవచ్చును—వారికి నేఁ జెప్పున దిదియే. వైద్యుఁ డితరులకు "అపథ్యము సేయవల"దని చెప్పును. తాను మాత్ర మా యుపదేశమును బాటింపక యపథ్యమునే సేయును. ఇఁక విధేయావిమర్శాది దోష వ్యాఖ్యానమున కుపక్రమింతును—

## విధేయావిమర్శదోషము:

ప్రధానముగఁ జెప్పఁదలఁచిన యర్థము విధేయము. ఇంతకుఁ బూర్వమే సిద్ధించియున్న వస్తువునకు నూతనముగ నే ధర్మమును విధించు

చున్నామో యది విధేయ మగును. ఇంతకుఁబూర్వమే సిద్ధించియున
యర్థమును "ఉద్దేశ్య"మని చెప్పుదుము. ఈ యుద్దేశ్యవిధేయములల
నుద్దేశ్య మప్రధానము,విధేయము ప్రధానము నగును. ఉద్దేశ్య వాచకవ
పూర్వపదముగను, అప్రధానముగను నుండవలయును. విధేయ ముత్త
పదముగను, ప్రధానముగను నుండవలయును. ఇందుకు వ్యత్యాసము
నున్నచో, విధేయావిమర్శదోష మున్న దని చెప్పుదుము.

ఉదా॥ "సంరంభః కరికీటమేఘశకలోద్దేశేన సింహస్య యః
సర్వస్యైవ స జాతిమాత్రనియతో హేవాకలేశః కిల
ఇత్యాశాద్విరదక్షయాంబుదఘటాబన్ధేప్యసంరబ్ధవాన్
యోఽసౌ కుత్ర చమత్కృతే రతిశయం యాత్వంబికాకేసరీ"

అర్థము:—

కరికీటమేఘశకలోద్దేశేన=ఏనుఁగు లనెడు పురుగులను, మేఘవ
లనెడు చిన్నముక్కలను (తుచ్ఛములగు నేనుఁగులను, చిన్న మేఘ
ముక్కలను) నుద్దేశించి, సింహస్య = సింహమునకు, యః, సంరంభః
ఏ యాటోపము గలదో, సః హేవాకలేశః=అల్పమగు నాయాటోపమ
సర్వస్యైవ=అన్ని ప్రాణులకును, జాతిమాత్రనియతః = జాతిచేతనే సి
మైనది; ఇతి = విషయమిట్లుండ, ఆశాద్విరదక్షయాంబుదఘటా
బన్ధేపి—దిగ్గజముల యొక్కయు, ప్రళయకాల మేఘముల యొక్క
సమూహమునందు, యః =ఏది, అసంరబ్ధవాన్ = సంరంభములేని
యుండునో, అసౌ=ఆ, అంబికాకేసరీ=శ్రీపార్వతియొక్క సింహమ
కుత్ర = ఏవిషయములో, చమత్కృతేః అతిశయం = చమత్కార
యమును (తన గొప్పఁదనమును) యాతు=పొందును (ప్రదర్శించు
ఇచట 'అసంరబ్ధవాన్' = 'సంరంభములేనిది' అను పదప్రయోగ
వలన—"సింహమునందు సంరంభక్రియ లేదు"అనియే కవి చెప్పఁదల
నాఁడు—అనఁగా సంరంభక్రియను నిషేధింపఁదలఁచినాఁడు—సంరం

క్రియాప్రతిషేధ మిచట ప్రధాన మన్నమాట. కాని, "న సంరబ్ధవాన్" అని విడిగాఁ బదములను బ్రయోగింపక, "అసంరబ్ధవాన్" అని సమాసము చేయుటచే, ఈ నిషేధము సమాసములో గుణీభూతమై, ప్రధానముగ భాసించుటలేదు. మనకుఁ గావలసినది నఞ్, క్రియతో నన్వయించు, ప్రసజ్య ప్రతిషేధమే. ఉత్తరపదముతో సమసించి నఞర్థమగు నిషేధమున కప్రాధాన్యత నిచ్చు పర్యుదాసముగాదు. ఇచట నఞ్ సమాస ముండుటచే నిషేధ మప్రధాన మగుచున్నది. కావున సమాస మనుపపన్న మగుచున్నది.

పర్యుదాస లక్షణము:

ప్రధానత్వం విధే ర్యత్ర ప్రతిషేధేఽప్రధానతా
పర్యుదాస స్స విజ్ఞేయో యత్రోత్తరపదేన నఞ్

ఎచ్చట విధికిఁ బ్రాధాన్యము, ప్రతిషేధమున కప్రాధాన్యము, నఞున కుత్తరపదముతో సంబంధము, (సమర్థసమాసము, ఏకవాక్యత్వము గూడ) నుండునో, యచట పర్యుదాస మని తెలియవలెను.

ఉదాహరణము:

జుగోపాత్మాన మత్రస్తః భేజే ధర్మ మనాతురః
అగృధ్నురాదదే సోఽర్థ మసక్తః సుఖ మన్వభూత్

అర్థము:

సః = ఆ దిలీపమహారాజు, అత్రస్తః = భయములేనివాఁడై, ఆత్మానం=తనను, జుగోప=రక్షించుకొనెను: అనాతురః = ఆపన్నుఁడు కాకయే, ధర్మం=ధర్మమును, భేజే = అనుష్ఠించెను. అగృధ్నుః = లోభములేనివాఁడయియే, అర్థం=ధనమును, ఆదదే=గ్రహించెను; అసక్తః=సంగములేనివాఁడై, సుఖ మన్వభూత్=సుఖము ననుభవించెను.

ఇచట, అత్రస్తుఁడై యున్న దిలీపమహారాజు నుద్దేశించి, ఆత్మ రక్షణము విహిత మగుచున్నది. త్రాసరాహిత్య మింతకుఁబూర్వమే

సిద్ధ మైన యర్థము. "భయనిషేధమును, కవి క్రొత్తగ విధించుటలేదు
అందుచే నది ప్రధానము గాదు.—న+త్రస్తః=అత్రస్తః అని న
న కుత్తరపదముతో నిట సమాస ముండుటచే నిది పర్యుదాస మైన
ఇందులో, త్రాసనిషేధము ప్రధానముగాదు. త్రాసరాహిత్య విశి
డగు నతని నుద్దేశించి విధింపఁబడిన "ఆత్మగోపనమే ప్రధానము
భాసించుచున్నది. ఇట్లిచట పర్యుదాసలక్షణము సమన్వితమగుచున్న
అట్లగుటచే "నఞ్ సమాస మిచట నుచితముగనే యున్నది. ఇటుల
అనాతురః, అనక్తః, అను పదములవిషయమైకూడ సమాస ముపపన
మే యగుచున్నది.

ప్రసజ్య ప్రతిషేధము- లక్షణము: ప్రజస్యప్రతిషేధ మనున
దానికి విపరీతముగ నుండును.

"అప్రాధాన్యం విధే ర్యత్ర ప్రతిషేధే ప్రధానతా
ప్రసజ్యప్రతిషేధోఽసౌ క్రియయా సహ యత్ర నఞ్".

తా॥ ఎచట విధికిఁ బ్రాధాన్యము లేదో, ప్రతిషేధమునకే ప్రాధా
ముండునో 'నఞ్' క్రియాపదముతో నన్వయించునో యచట ప్రస
ప్రతిషేధ ముండును.

ఉదాహరణము:—

"నవజలధర స్సన్నద్ధోఽయం న దృప్తనిశాచరః
సురధను రిదం దూరాకృష్టం న తస్య శరాసనమ్
అయమపి పటు ర్ధారాసారో న బాణపరంపరా
కనకనికషస్నిగ్ధా విద్యుత్ ప్రియా న మమోర్వశీ".

<u>అర్థము.</u>

సన్నద్ధః=చంపుటకు సిద్ధముగ నున్న, అయం=ఆ శబ్దపువ్యక్తి,
జలధరః=క్రొత్తమేఘము, దృప్తనిశాచరః=మదించిన రాక్షసుఁడు,
(భవతి)=కాఁడు. దూరాకృష్టం=బాగుగా లాగఁబడిన, ఇదం=ఇది

ధనుః=ఇన్ద్రధనుస్సు; తస్య=ఆ రాక్షసునియొక్క శరాసనం=ధనుస్సు, న భవతి=కాదు. పటుః=తీవ్రమగు, అయం=ఇది, ధారాసారః=ధారలుగ కురియుచున్న వర్షమే, బాణపరంపరా = బాణములయొక్క వరుస, న (భవతి) = కాదు కనకనికషస్నిగ్ధా = బంగారుగీతవలెమెఱయునది, విద్యుత్=మెఱపే, మమ, ప్రియా, ఊర్వశీ=నాప్రియురాలగు ఊర్వశి, న భవతి=కాదు.

ఇచట దృప్తనిశాచరుఁడు లేఁడను నిషేధము ప్రధానముగ భాసింపవలయును. అందుచే నఞ్ నకు త్తరపదముతో సమాసముఁజేసి "అదృప్త నిశాచరః" అని ప్రయోగింపక దృప్తనిశాచరః న, (భవతి) అని వ్యస్తముగఁ బ్రయోగించినాఁడు. 'న' యనునది, భవతి యను క్రియతో నన్వయించుచున్నది.

ఇట్లు, నిషేధమునకుఁ బ్రాధాన్యము, విధికప్రాధాన్యము, నఞ్ నకు నుబన్తముతో సమాసము లేకుండుట యను నంశములు మూఁడును నిచటఁ గన్పడుచున్నవి. కాఁగా నిది ప్రసజ్యప్రతిషేధమైనది.

ప్రస్తుతము "అసంరబ్ధవాన్" అనునపుడు పర్యుదాసము నాశ్రయించి నఞ్ సమాసముచేయుటవలన నుచితమగు నర్థముభాసించుటలేదు. సంరంభక్రియను నిషేధించుట మన కభిమతము. ఉదాసీనుఁడగు, సంరంభవదృశకర్తను బ్రధానముగ విధించుట మన కభిమతము కాదు. ('అబ్రాహ్మణః' అనునపుడు, బ్రాహ్మణసదృశుఁడు, బ్రాహ్మణభిన్నుఁడు నగు క్షత్రియాదులను బ్రాహ్మణశబ్దము తెల్పును. అటులే అసంరంభవత్ శబ్దముకూడ సంరంభవత్సదృశ మగు ససంరంభవత్ వస్తువును దెలుపును. కాని యీ యర్థ మిచట మన కభిమతము కాదు) సంరంభక్రియను నిషేధింపవలయు నన్నచో నఞ్ నకుఁ గ్రియతో సంబంధ ముండవలయును. కాని యీ సమాసమున నఞర్థము (సంరంభనిషేధము) గుణీభూతమైపోయినది. సంరంభవత్సదృశ మగు మఱియొక యర్థము

ప్రధానమై భాసించుచున్నది. నఞ్ పదమునకు గ్రియాభి సంబంధము ప్రధా
ముగ భాసించుటలేదు. అందుచే మనము ప్రతిపాదింపఁదలఁచిన యర్థ
సిద్ధింపదు. వివక్షిత మగు నర్థము (సంబంధ క్రియా నిషేధము ప్రధా
ముగ భాసించుట)సిద్ధింపవలయు నన్నచో సమాస ముపపన్నము గా
సమాసమునందు నఞర్థము గుణీభూతమై, దాని తరువాత నున్న
మురెుుక్క యర్థము ప్రధానముగ భాసించును. కాని మనకు నఞ
ప్రధానముగను, ఉత్తరపదార్థము గుణీభూతముగను భాసింపవలయు
ఇట్లు, సమాసము చేయుటచే విధ్యనువాదభావము తలక్రిందైనది.
ర్థము గుణీభూతముగను, ఉత్తరపదార్థము ప్రధానముగను భాసింప
యు నన్నచో నట్టి తావున సమాస ముపపన్నమే యగును.

ఉదా॥ కావ్యార్థతత్త్వావగమో న వృద్ధారాధనం వినా
అనిష్టవాన్ రాజసూయం కః స్వర్గం ముఖ్య మశ్నుతే''

అర్థము :

వృద్ధారాధనం వినా=వృద్ధులను సేవింపకయే, కావ్యార్థతత్త్వా
గమః=కావ్యార్థముయొక్క తత్త్వజ్ఞానము న (భవతి) = కలుగదు
రాజసూయమ్=రాజసూయయాగమును, అనిష్టవాన్ = చేయనివా
కః=ఎవడు, ముఖ్యం స్వర్గమ్=ముఖ్య మగు స్వర్గమును, అశ్నుతే=
దును!

"అనిష్టవాన్'' అనునపుడు, నఞర్థ మగు నిషేధమునకుఁ బ్రా
న్యము లేకుండుటచే సమాస ముపపన్నమే యగుచున్నది. అన
వాన్, మొదలగు సమాస స్థలములలోఁగూడ నఞర్థము క్రియతో
యించు ననియే యేల చెప్పఁగూడదు? అని ప్రశ్నింపవచ్చును.
సమాధాన మిది—క్రియాంశము, కర్త్రంశము, నను రెండంశము
కృదన్తములలో భాసించును. ధాతువు క్రియను దెలుపును. ప్రత్యయ
కర్తను దెల్పును. ఒక వాక్యములో క్రియాంశ కర్త్రంశములగు నర్థ

లను నిషేధింపవలసి వచ్చినపుడు, "నఞ్"చే క్రియాంశమునే నిషేధింప వలయును. ఉదాహరణమునకు—"న ఇష్టవాన్;" ఇది యొక వాక్యము. ఇష్టవాన్ అనుచో 'యజ' క్రియయు కర్తృవాచకమగు "క్తవత్" ప్రత్యయమును నున్నవి. ఇందులో నఞ్ చే క్రియాంశమునకే నిషేధమును చెప్పవలెను. ఇష్టవాన్, న (భవతి) అనునపుడు, "భవతి" అను క్రియ ప్రతీయమాన మగుచున్నది. "భవతి" అనునది "సత్త"ను ("ఉండు టను") బోధించును. "నఞ్" ఈ ప్రతీయమాన మగు సత్తాక్రియాంశ మునే నిషేధించును. సమాసము దగుచో 'నఞ్' కర్త్రంశమును నిషేధించును.

అకుంభకారః

ఇచట "కృ" ధాతుబోధ్య మగు "చేయుట" యను క్రియయు, అణ్ ప్రత్యయబోధ్య మగు కర్త్రంశము నున్నవి. ఇది సమాస మగుటచే, నఞ్, ఇందలి కర్త్రంశమునే నిషేధించును. అనఁగా కుమ్భకార నిషేధమే యిట భాసించునుకాని, చేయుట యను క్రియకు నిషేధము భాసింపదు. ఇట్లొకచోఁ గ్రియాంశమునకును, మఱియొకచోఁ గర్త్రంశ మునకునుమాత్రమే నిషేధ ముండు ననుట శబ్దశక్తికి స్వభావము—

క్రియాకర్త్రంశభాగర్థో వాక్యేఽపోహ్యో నఞా యది
క్రియాంశ ఏవాపోహ్య స్స్యా న్నేష్టవానితివత్ తదా (3)
అకుంభకార ఇతివత్ వృత్తౌ తు స్యా ద్విపర్యయః
ఇత్యేవ నియమోఽర్థస్య శబ్దశక్తిస్వభావతః (4)

(అన్తరశ్లోకములు)

శబ్దశక్తి స్వభావము ననుసరించి యర్థనియమ మిట్లున్నను, వ్యామోహ మువలనఁ గొందఱు కవులు నఞర్థము గుణీభూతమైనపుడుకూడ సమా సము నుపయోగించుటలేదు.

ఉదా॥ (1) నను సాధుకృతం ప్రజాసృజా। శశికాన్తేషు మనో న కుర్వతా
నహి చేతనతా మవాప్య తే। విరమేయు ర్గలితేన కేవలమ్"

అర్థము :

శశికాన్తేషు=చన్ద్రికాన్తశిలలయందు, మనః=మనసును, 
తా=సృజింపని, ప్రజాసృజా=బ్రహ్మదేవునిచేత, సాధుకృతం నను=
పనియే చేయఁబడినది; చేతనతామ్=ప్రాణమును, అవాప్య=పొంది,
ఆ శశికాన్తశిలల, గలితేన కేవలమ్=ద్రవించుటతోనే, నవిరమేం
విరమించెడివి కావు—

నకుర్వతా-అనునపుడు నిషేధమునకుఁ బ్రాధాన్యములేదు,
దుచే నిచట "అకుర్వతా" అని సమాసము చేయవలయును. చేం
డుట వ్యామోహము.

(2) "గృహీతం యేనాసీః పరిభవభయాన్నోచితమపి-"

యేన=నాతండ్రియగు నే ద్రోణాచార్యునిచేత,పరిభవభయా
అవమాన భయమువలన, నోచితమపి=అనుచితమైనను, (అగ్రాప
నను) గృహీతమ్ ఆసీః=గ్రహింపఁబడితివో—

ఇచటఁగూడ న+ఉచితమపి—నోచితమపి, అని సమాః
జేయకుండుటచే, ఉచితశబ్దముచే బోధింపఁబడు, గ్రహణ క్రియ
నఞర్థ మన్వయించు చున్నది. గ్రహణ నిషేధము భాసించుచున
గ్రహణ నిషేధము ప్రధానముగ భాసించుట కవికభిమతము గాదు
దుచే నిచటఁగూడ నఞర్థమునకు గుణీభూతత్వము సిద్ధించుటకై, "
ర్వతా" అని సమాసము నుపయోగింపవలెను.— న, కుర్వతా
వ్యస్తప్రయోగము కూడదు.

ప్రశ్న :

"అశ్రాద్ధభోజీ" "న శ్రాద్ధం భుంక్తే" అని విగ్రహ వాక్య
ఇచట"నఞ్"సమాసముతోనుండి గుణీభూత మైనది. అయి
"భుజి" క్రియతో నన్వయించి, శ్రాద్ధభోజనా భావమును, (భోజన క్రి
నిషేధమును) తెలియఁజేయుచునే యున్నది. క్రియాన్వయ ముంద

క్రియ గుణీభూతమగుటచే నఞ్‌నకుఁ క్రియాన్వయముండదు. ఇట్లు వా
సమాసములు భిన్నార్థకము లగుటచేఁ బ్రసజ్యప్రతిషేధ మనునది వా
మునసే భాసించును. సమాసమున సమన్వితము గాదు. శ్రాద్ధభోజీ
నది పర్యుదాసమే యగుటచే నచట సమాస ముండు టన్యాయ
యగును. సమాసమే యుండవలెను. "అసూర్యంపశ్యాః" మొద
పదములందుఁగూడ నిట్లే తెలియనగును. అసంరబ్ధవత్ పదమున,
రంభప్రతిషేధము ప్రధానముగ వివక్షితము. విధిప్రాధాన్యము వివ
ము గాదు. ఇట్లు, ప్రధానముగ భాసింపవలసిన నిషేధ మప్రధాన
భాసించుచు, నప్రధానముగ నుండవలసిన విధి ప్రధానముగ భాసి
టచే నుద్దేశ్య విధేయభావము తారుమారై, విధేయావిమర్శ
మున కాలవాల మైనది.

వాక్యసమాసములలో నఞన్వయభేదము గల దను విషయ
మీక్రింది యుదాహరణమువలనఁ దెలిసికొనవచ్చును.

"భుంక్తే సదా శ్రాద్ధమయం పరాంశ్చోపతాపయేత్ ఇత్య
యథార్థ
సమ్యక్ స్వభావోఽవగతోఽస్యతావన్న శ్రాద్ధభోజీ నప
రోపతా

అర్థము: అయం=ఇతఁడు, సదా—ఎల్లపుడును, శ్రాద్ధంభుం
శ్రాద్ధాన్నమును భుజించును, పరాన్=ఇతరులను, ఉపతాపయేత్
పీడించునుగూడను, ఇతి=అనునీవిషయము, అయథార్థమేవ=అసత
అస్య=ఇతనియొక్క, స్వభావః=తావత్=శీలము, సమ్యక్=లెస్సగా,
గతః=తెలిసినది. వీఁడు శ్రాద్ధభోజీ న (భవతి)—శ్రాద్ధాన్నమును భుజి
వాఁడుకాఁడు, పరోపతాపీ న (భవతి)—ఇతరులను పీడించువాఁడునుగా

"శ్రాద్ధభోజీ నభవతి" అను వాక్యమున 'నఞ్' 'భవతి'
క్రియతో నన్వయించి, క్రియాప్రతిషేధమును దెల్పుచున్నది
క్రియానిషేధము ప్రధానమును, వివక్షితమునుగూడ నై యున్నది.

ఇఁక, 'అశ్రాద్ధభోజీ' అను సమాసస్థలమున, 'నఞ్', "శ్రాద్ధభోజీ, పదముతో నన్వయించుటచే శ్రాద్ధభోజిపదము శ్రాద్ధభోజిభిన్నుఁడును, శ్రాద్ధభోజిసదృశుఁడును నగు 'విఘసాశుని'(యజ్ఞశేషమును, లేక భోజన శేషమును భుజించువాఁడు విఘసాశుఁడు) -దెల్పును. ఇట్లు వాక్యసమాసములకు రెంటికిని భేద మున్న దని తెలియవలెను.

ఈ రెంటిలో "శ్రాద్ధభోజీ న భవతి" అనువాక్యమే ప్రసజ్య ప్రతిషేధమునకు విషయ మగును. అశ్రాద్ధభోజీ యనునది కాదు. అశ్రాద్ధభోజీ యనునదికూడ ప్రసజ్యప్రతిషేధమే యగుచో, సఁక సమాసమునకును వాక్యమునకును భేదమే యుండదు. సమాసమున కర్థము మన యిష్టమువచ్చినట్లు చెప్పుట కవకాశము కల్గును.

అసంరబ్ధవత్పదమున వాస్తవముగ నఞర్థము విధేయము, ప్రధానమును. సంరబ్ధవత్పద మనూద్యమానము (ఉద్దేశ్యము) నప్రధానమును- కాని యిట, ఆ "సంరబ్ధవత్పదము, సమాసములో నుండుటచే విధేయము, ప్రధానమునై, వాస్తవిక వ్యవస్థితికి విపరీత స్థితి నందినది-ఇట్టి యీ సంరబ్ధవత్పదముతో నఞ్‌నకు సమాసము చేయుట సదాచారనిరతునకుఁ బతితునితోఁ గల్గిన స్నేహముతోఁ దుల్యమై సత్పురుషులనిందకు మాత్రమే విషయ మగును.

"నఞర్థస్య విధేయత్వే నిషేధ్యస్య విపర్యయే
సమాసో నేష్యతేఽర్థస్య విపర్యాస ప్రసంగతః"(11-51 సంగ్రహ శ్లోకము)

ఇంతవఱ కసంరబ్ధవత్పదములో నున్న విధేయావిమర్శదోషము నిరూపిత మైనది. "సంరంభః కరికీట" అను పద్యమునందే మఱియొక విధేయావిమర్శదోషమును నిరూపించుచున్నాము.

కేవలయచ్ఛబ్ద ప్రయోగము దుష్టము—

"యోఽసౌ" అనునపుడు యచ్ఛబ్దమును మాత్రమే ప్రయోగించుటయును సమంజసము కాదు. ప్రసజ్యప్రతిషేధమునందు నఞర్థము విధే

యము, నిషేధ్య మగు నర్థము అనువాద్యము నైనట్లు యత్ తత్
ములలో, యచ్ఛబ్దము అనువాద్యవిషయ మనియు, తచ్ఛబ్దము విధే
విషయమనియు,శబ్దశక్తి స్వభావము ననుసరించిన యర్థనియమముల
ఈ శబ్దములు రెండును బరస్పరనిత్యసాపేక్షములు. అందుచే
వాక్యమును యచ్ఛబ్దముతో నుపక్రమించినపుడు తచ్ఛబ్దముతో సమా
జేయవలయును. తచ్ఛబ్దముతో ప్రారంభ మైనచో యచ్ఛబ్దముతో
సంహార ముండవలయును. "యత్తదోర్నిత్య మభిసంబంధః"అను వా
మీయర్థమునే తెల్పును. — ఈ శబ్దములయుపక్రమోప సంహారము
శాబ్ద మనియు, ఆర్థ మనియు రెండు రకములు, రెండు శబ్దముల
ప్రయుక్తము లగుచో నచట శాబ్ద మగు నుపక్రమోపసంహారమున్న
తెలియవలెను. శాబ్దోపక్రమోపసంహారము.

ఉదా॥ "యదువాచ న తన్మిథ్యా యద్దదౌ న జహార తత్" య
దేనిని, ఉవాచ=పలికెనో, తత్ = అది, మిథ్యాన=అసత్యముగా
యత్ =ఏది, దదౌ=ఇచ్చెనో,తత్ =దానిని, న జహార=అపహరింపలే

మఱియొక యుదాహృతి—

"న దుర్మతిః శ్రేయసి యస్య నాదరః స పూజ్యకర్మా సుహృ
శృణోతి య

యస్య=ఎవనికి, శ్రేయసి=శ్రేయస్సునందు, ఆదరః, న=గౌరవ
లేదో, సఃదుర్మతిః=వాడు దుర్బుద్ధి; యఃసుహృదాం శృణోతి=ఎవ
స్నేహితుల (మాట) వినునో,సఃపూజ్యకర్మా=మంచి వాఁడు.

ఆర్థ మగు నుపక్రమోపసంహారము—

యత్తచ్ఛబ్దములలో నొకదానిని మాత్రమే ప్రయోగించు
నది యార్థోపక్రమోపసంహార మగును. అట్టి తావున నర్థబలమువ
రెండవ శబ్దము నూహింతుము. అందులో, తచ్ఛబ్దమును మాత్ర
ప్రయోగించినపు డర్థసామర్థ్య బలమునఁ గల్పింపఁబడు యత్ శబ్ద

ప్రసిద్ధ విషయమునుగాని, అనుభూత మైన విషయమునుగాని, ప్రకాశ్యమైన విషయమునుగాని బోధింపవచ్చును. ఇట్లు కేవల తచ్ఛబ్ద ప్రయోగ విషయము మూఁడు రకములుగ నున్నది.

ప్రసిద్ధార్థ విషయమున కుదాహరణము :—

ద్వయం గతం సంప్రతి శోచనీయతాం, సమాగమప్రార్థనయా కపాలినః కలాచ సా కాన్తిమతీ కలావతః త్వమస్య లోకస్య చ నేత్ర కౌముదీ.

అర్థము :

కపాలినః = కపాలమే (భిక్షాపాత్రముగా) గల శివునియొక్క-సమాగమప్రార్థనయా = సమాగమమును బ్రార్థించుటచేత, సంప్రతి= ఇప్పుడు, ద్వయం=రెండు, శోచనీయతాం=దుఃఖింపఁదగినవి, గతం= అయినవి—కలావతః = చంద్రునియొక్క, కాన్తిమతీ – కాంతిగల (యా = ఏప్రసిద్ధమైన కళకలదో) సా=ఆ, కళాచ = కళయు, అస్య లోకస్య = ఈలోకమునకంతకును, నేత్రకౌముదీ=కనులకు వెన్నెలయగు త్వంచ=నీవును.

ఇచట 'సా. కళా' యనునపుడు తచ్ఛబ్దమే యున్నదిగాని, దీనికి సరిగా "యా" యను పదము లేదు. కాని శివుని వరించిన చంద్రకళ యనఁగానే, శివుని శిరస్సు నలంకరించు చంద్రకళ యని యందఱకును నర్థమగును. ఎవరును ఆ చంద్రకళ యేది? యని ప్రశ్నింపరు. అది జగత్ప్రసిద్ధ మగుటయే యిందుకు హేతువు. కావున, తచ్ఛబ్ద సాపేక్షముగ నిట నుండ వలయు నని మన మూహించిన యచ్ఛబ్దము ప్రసిద్ధ విషయక మని తెలియుచున్నది.

అనుభూత విషయక యచ్ఛబ్దము :

(1) " తే లోచనే ప్రతిదిశం విధురే క్షిపన్తి ".

"చంచల మగు నా నేత్రములను బ్రతి దిశకును బ్రసరింపఁజేయుచు"—ననుటలో, ఏనేత్రముల నిదివఱకు నాయఁకు డనేకపర్యాయ

ము లనుభవించియున్నాఁడో యానేత్రము లని యర్థము—య
మిచట ననుభూతము లగు నేత్రములను బరామర్శించుచున్నది.

(2) తద్వక్త్రం యది ముద్రితా శశికథాతచ్చేత్ స్మితం కా
సా దృష్టి ర్యది హారితం కువలయై స్తాశ్చేద్గిరో ధిఙ్మధు
సాచేత్కాన్తిరతస్త్రమేవ కనకం కిం వా బహుబ్రూమ
యుత్సత్యం పునరుక్తవస్తు విముఖః సర్గక్రమో వేధసః

అర్థము:

తద్వక్త్రం, యది=ఆ ముఖ మున్నచో, శశికథా, ముద్రి
చంద్రుని ప్రసక్తియే అక్కఱలేదు—తత్ స్మితం, చేత్—ఆ నవ్వే
న్నచో, సుధా, కా,=అమృత మేల (అమృతమే నిన్దిత మగును)
దృష్టిర్యది=ఆదృష్టి (నేత్రము) యున్నచో, కువలయైః, హారితం=
వలు తిరస్కృతములై నట్లే; తాఃగిరఃచేత్ — ఆ పలుకులే యున్న
ధిజ్మధు=తేనెతోఁ బనిలేదు; సాకాన్తిఃచేత్=ఆ కాన్తియే యుండు
కనకం అతస్త్రమేవ=బంగారము వ్యర్థమే, వేధసః = బ్రహ్మదెు
సర్గక్రమః=సృష్టిక్రమము, పునరుక్తవస్తువిముఖః ఇతియత్ = చేసిన
వునే చేయుటయైన దని విచారముతోఁ బరాఙ్ముఖ మైనది యను మ
సత్యం=నిజమే. ఇందు మనకుఁ గావలసిన యంశ మిది—ఈ శ్లోకమ
తత్ , సా, మొదలగు తచ్ఛబ్దములే యున్నవి. యచ్ఛబ్దమును
మూహింపవలయును. ఊహ్య మగు నీ యచ్ఛబ్దము, ఇంతకుఁబూర్వ
వక్తచే ననుభూతములైన వస్తువులను పరామర్శ చేయుచున్నది.

ప్రక్రాన్తవిషయకయచ్ఛబ్దము :—

"కాతర్యం కేవలా నీతిః శౌర్యం శ్వాపదచేష్టితమ్
అత స్సిద్ధిం సమేతాభ్యాముభాభ్యా మన్వియేష సః".

అర్థము :— కేవలా, నీతిః=రాజనీతి యొకటియే (యా
మగుట) కాతర్యం=పిఱికితనము, శౌర్యం కేవలం=కేవలశౌర్యము న

యించుట, శ్వాపదచేష్టితమ్=క్రూరమృగవ్యాపార మగును. అతః=అందువలన, సః=అగ్నివర్ణుఁడనురాజు, ఉభాభ్యాం సమేతాభ్యాం=రాజనీతిశౌర్యములను రెంట నాశ్రయించి, సిద్ధిః అన్విరోయేష=కార్యసిద్ధి నాశించెను.

ఇచటఁగూడ, తచ్ఛబ్దమే (సః) యున్నది. యచ్ఛబ్దమును మన మూహింపవలయును. ఇంతకుఁబూర్వమే యగ్నివర్ణుఁడనురాజును వర్ణించుటకుఁ గవి మొదలిడినాఁడు. ఆ యగ్నివర్ణుని, ఈ యచ్ఛబ్దము తెల్పును.

ఒకానొకచో నాసందర్భము ననుసరించి యత్, తత్ శబ్దములు రెండునుగూడ నాక్షేప్యము లగుచుండుటచే నది నాల్గురకములుగూడ నున్న దని చెప్పుచున్నారు.

"యేనామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
జాన న్తి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ."

అర్థము:—యేనామ=ఎవరైతే, ఇహ=ఇచ్చట నః=మాయొక్క, అజ్ఞానం=తిరస్కారమును ప్రథయ న్తి=విస్తరింపఁజేయుదురో, తే, కిమపి జాన న్తి=వారి కేదియో తెలియును. (1) వారికి బ్రహ్మస్వరూపము తెలియును (2) వారి కేమియును దెలియదు. తాన్ప్రతి=వారినిగురించి, ఏషః యత్నః న=నేనీకార్యనిర్మాణ ప్రయత్నముఁ జేయుటలేదు. మమ=నాకు,సమానధర్మా=సమానమగుగుణములుకలవాఁడు,కోఽపి=ఎవఁడో ఉత్పత్స్యతే=పుట్టఁగలఁడు. హి=ఎందువలననఁగా, అయంకాలః=ఈకాలము, నిరవధి=అంతులేనిది. పృథ్వీచ=భూమియును విపులా = విశాలమైనది.

ఇచట మనము గమనింపవలసిన యంశ మిది—"మమ తు కోఽపి సమానధర్మా ఉత్పత్స్యతే" "మంచికాని, చెడుగాని, నాలో సమాన